# ఫాసిజం - దాని విధ్వంసనం.

పెండ్లిలో:

నాగిరెడ్డికీ — కాంతమ్మకూ

చదివింపులు.



అక్టోబరు 20, '43.

నాగులూ,

మనదేశం నేడొక క్లిష్టపరిస్థితిలో చిక్కుకున్నది. క్షామంతో ప్రజలు క్షీణించిపోతున్నారు. ప్రజా నాయకులు కారాగారాల్లో నిర్బంధితులైనారు. ప్రభుత్వం ప్రజాభిప్రాయాన్ని లెక్కించడంలేదు. ప్రజలు నిస్పృహతో నిరాశతో నిలబడిపోయినారు.

ఫాసిజం మన సరిహద్దుల్లో సమాయత్తమై పొంచి కూచున్నది. అగ్నిగోళాలతో మన ప్రజలను బాధింపజూస్తున్నది. దేశరక్షణ తత్క్షణ కర్తవ్యంగా బాధ్యతగా నిల్చినది. అందుకు మార్గమేది?

ఫాసిజమంటే యేమిటో దాని వినాశంతో మన స్వతంత్ర మెట్లా తెచ్చుకోగలమో తెలుసుకొని ప్రజలను సమీకరించే బాధ్యత దేశభక్తులందరిదీ. ఇదే చూచాయగా యీపుస్తకంలో వివరించినాను.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ప్రముఖ నాయకుల్లో ఒకడూ ఫాసిజం వివరణలో ప్రజాసంగ్రామ విమర్శనంలో సిద్ధ హస్తుడూ అయిన రజనీ పామీదత్తు రచనలు ఇందుకు ఆధారంగా తీసుకొన్నాను. ఇంకా తోడ్పడిన రచనలు చాలా వున్నవి. వారందరికీ కృతజ్ఞుడనని వేఱె చెప్పనవసరంలేదు.

నీవీదిన మొక యింటివాడ వవుతున్నావు. మీయిద్దఱూ ఫాసిస్టు విరుద్ధశక్తి నుత్తేజింపజేసి తద్వారా మాతృదేశ స్వతంత్రసంపాదనకు కంకణబద్ధులు కావాలని ఉద్బోధిస్తూ మీకే యీ పుస్తకాన్నంకితం చేస్తున్నాను.

అనంతపురం.

విశ్వం.

---

## Bibliography.


'Britain in the World Front' and various articles.
—Palme Dutt.
'Working class against Fascism. —Dimitroff.
'War in the Pacific'—Chinese leaders P. P. H.)
'Menace of Fascism'—John Strachy.
'French people against Hitler' —P. P. H.
'What happened in Burma' (Kithabistan)
'Molotov's Note on Nazi atrocities in Occupied Russia.'
Real Face of Japan —Jack Chen.
'I saw it with my own eyes' (P. P. H)
'International literature' (Moscow)


Quotations of various German Leaders & Journals are also taken from the above books only.

# ఫాసిజం స్వరూపం.

---

నానాటికీ హింసలూ ఖూనీలూ దురాక్రమణలూ మితిమీరిపోతూన్నందుకు ఫాసిజం కారణమని మనకు తెలుసు. దిక్కులేనన్ని దేశాలు నిర్ధూమధామం చేయబడినవి. నూర్లయేండ్లుగా స్వతంత్రాన్ననుభవిస్తూండిన ఫ్రెంచి ప్రజలు బానిసలైనారు. జాతులు రూపుమాసినవి. కసికందులు మొదలు కాటికి కాళ్ళుచాచుకొన్న ముసలీ ముతకా కఱకూ బాంబులకు గుఱవుతున్నారు. ఊరికి కొన్ని ఉరికంబాలు; వానికి వ్రేలుతున్న స్వేచ్ఛాప్రియులు; తెగిపోరాడుతూ ప్రతి అంగుళమూ బాధాదూనమానసంతో సందువిడుస్తూ మరీ పోరాడి జన్మభూమిని స్వాధీనపఱుచుకుంటూన్న రెడార్మీ యోధులు. ఇదీ నేడు మనకు ఫాసిజం పేరుచెబితే కళ్ళకు కనిపించేవి. దురాక్రమణకూ దుండగాలకూ దోపిడీకీ చెఱలకూ చెఱసాలలకూ విజ్ఞాన వినాశానికీ సభ్యతా నిర్మూలనానికీ ప్రాజ్ఞపరాభవానికీ పర్యాయపదమయిపోయింది ఫాసిజం. ఇంకా దీనికి వివరణ మేమిటనిపిస్తుంది,

కానీ మనం ఫాసిజాన్ని బాగా తెలుసుకోవాలన్నప్పుడు శాస్త్రీయదృష్టితో దాన్ని బాగా అవగాహనచేసుకోవలెను. మనం దేన్ని ద్వేషిస్తున్నామో యెందుకు ద్వేషిస్తున్నామో తెలుసుకోవాలి. అందులోనూ మనకు చాలా అవసరం. నేడు మనదేశములోని ఫాసిస్టు విరుద్ధవర్గాల్లోనూ వివిధాభిప్రాయాలు కనిపిస్తున్నవి. కొందఱు ఫాసిజం పరమవిరోధిగా తెలుసుకొన్నా, ఇంపీరియలిజంమీద ద్వేషంతో గ్రహించరు.

కొందరు జీతగాని కయిజమైతే క్షేమని పెదవి విరుస్తారు దురభిప్రాయాలు ఇంకా వున్నవి. జర్మనీవాళ్లేయింత; ఆ జాతిలోనే దురాక్రమణా దురాశా యెక్కువనేవాళ్ళూ ఉన్నారు. వారనేది హిట్లరు ప్రభుత్వాన్ని నిర్మూలించాలనే కాదు, జర్మన్ జాతినే పాతిపెట్టాలని. ఇంకొకరు ఫాసిజం వాళ్ళ దేశానికి మంచిదే కానీ, ఈహిట్లరు తెలివిలేక అందరిమీదా పడినాడండీ అని సాగదీస్తారు. ఫాసిజానికీ కమ్యూనిజానికీ, ధనిక నియంతృత్వానికీ కార్మిక నియంతృత్వానికీ భేదం కనుక్కోలేక తికమకపడేవారూ లేకపోలేదు. యీ గందరగోళంతోనే మన ఆదర్శం మలినంగావుంది. మన ప్రయత్నం దెబ్బతింటున్నది. స్పష్టంగా దాని స్వరూపం తెలుసుకోవడం అవసరం.

మనం ద్వేషిస్తున్నది జర్మన్ జపాన్ ప్రజలను కాదు. ఆ ప్రజాసామాన్యాన్ని వంచించి బలవంతంగా దోపిడికి పూనిన ఆ ప్రభుత్వాలనూ దానికి వెనకనున్న సిద్ధాంత విధానాలనూ, నిరంకుశాధికారులనూ.

హింసలతో దౌర్జన్యంతో దారుణ కార్యక్రమంతో ఆ ప్రజలమీద రుద్దబడిన వా ప్రభుత్వాలు. కొందరు నీచులూ స్వార్థపరులూ ఆ అధినేతలకు పక్కతాళం వేసినారు. ప్రజాద్రోహం చేసినారు. ఫాసిస్టు శిక్షణ నగ్గుపాలతో తాగిన అమాయక యువకులు నమ్మితున్నారు. ప్రజా సామాన్యం కొంత భయభ్రాంతులై అబద్ధాలు నమ్మి గొర్రెదాటుగా అనుసరిస్తున్నారు. కానీ ఆదేశాల్లో యెన్నో నిర్బంధాలకూ చిత్రవధలకూ ఉరిశిక్షలకూ పాల్పడుతూనే, స్వేచ్ఛాప్రియులెంతో యెంత పోరాడుతూనే వున్నారు. వారు మనకు మిత్రులు. మిగతా ప్రజలు, నాయకుల బలవంతానికి

లోబడైనా యీ దురాక్రమణలో దౌర్జన్యంలో భాగరులౌతున్నంత వఱకు పోరాటం తప్పదు. సమూలనాశ మయ్యే వఱకూ ఫాసిజం మాఱదు. వీలైనంత త్వరలో ప్రజల కళ్ళు తెరిపించాలి. బలవంతంమీద నిల్పిన యీనరకాన్ని కూలద్రొయ్యాలి ఇందుకు స్వేచ్ఛాప్రియుల సహకార మత్యవసరం.

“ఈ యుద్ధం మా నెత్తిన త్రోసినవాళ్ళు జర్మన్ ప్రజలుకారు జర్మన్ కార్మికులూ రైతులూ వైజ్ఞానికులూ కాదు. వారి బాధలు సువిదితములే. ఇంక ఫ్రెంచి ప్రజలనూ జెక్కులనూ పోలులనూ సెర్బియన్లనూ నార్వే బెల్జియం డెన్మార్కు హాలెండు గ్రీసు మొదలైన దేశాలనూ బానిసలను చేసిన రక్తపిపాసులు ఫాసిస్టు ప్రభుత్వాల మూటమే యీ యుద్ధానికి కారణం”.

— జూన్ 22, 1941— స్టాలిన్.

బ్రిటిషు సోవియట్ సంధిపత్రంలో హిట్లరిజానికి విరుద్ధ యుద్ధంగా యీ యుద్ధం నిర్దిష్టమైంది. “జర్మనీలోని హిట్లరు ప్రభుత్వమూ తత్సహచర ప్రభుత్వాలూ దురాక్రమణలో సైన్యాధికారాన్ని యేర్పరచాలనే విధానాన్ని” అట్లాంటిక్ చార్టరులో వర్ణించారు . —ఆగష్టు 1941.

1941 డిశంబరు 4వ తేదీ స్టాలిన్ సికోర్స్కీ సంతకం చేసిన సోవియట్ పోలిష్ సంధిలో:

“జర్మన్ సైనిక సామ్రాజ్యతత్త్వం మానవకోటికి పరమ వినాశక విరోధి. దానితో యేవిధంగానూ రాజీపడడం సాధ్యపడదు.” అని మొదటివాక్యంలోనే చెప్పారు.

1942 జనవరి 1, 26 రాజ్యాలు చేసుకున్న ప్రపంచ సంఘటన సంధిలో యీ ఫాసిస్టు వ్యతిరేక యుద్ధాన్ని

'హిట్లరిజం'ను ఓడించడానికై చేస్తున్న యుద్ధమన్నారు. యీ సంధిపత్రాన్ని గూర్చి కామన్సులో మాట్లాడుతూ చర్చిల్ "భూగోళంలోని యేభాగంలోనైనా సరే, యేరూపంలో యేరీతిగా వున్నా సరే హిట్లరిజాన్ని విధ్వంసం చేయుడమే దాని ఉద్దేశ్య" మన్నాడు.

నెహ్రూ 'ధనాఢ్య ప్రాబల్యంగల ప్రభుత్వాహంకారమే 'ఫాసిజ' మన్నాడు. జాతీయ మహాసభ నిక్కచ్చిగా ఫాసిజం ప్రపంచ సభ్యతా శత్రువని ప్రకటించింది. జంగైషేకు-చీనానాయకుడు-ఫాసిజంను ప్రపంచంనుండీ పెరికి పారవేయడానికి కంకణం కట్టుకున్నాడు.

ఇట్లా ఆ కొననుండీ యీ కొనవరకూ వున్న ప్రపంచ స్వతంత్ర ప్రజానాయకులకూ స్వేచ్ఛాప్రియులకూ ధీమంతులకూ దేశభక్తులకూ కంటకంగా పరిణమించిన యీ ఫాసిజమేమిటి? దీని స్వరూప స్వభావాలేవి? మూల సిద్ధాంతాలేవి? తెలుసుకోవలెను.

జర్మనీలోని ఫాసిజాన్ని నేషనల్ సోషలిజమనీ, హిట్లరిజమనీ నాజీజమనీ అంటారు ఇటలీలో ఫాసిజమంటారు. జపానులో మిలిటరిజం; యేపేరుతో వున్నా యేదేశంలో వున్నా యేమైనా మూలసూత్రాలొక్కటే గనక వీటి నన్నిటినీ 'ఫాసిజం' అనే పేరనే వాడుతున్నాము.

ప్రపంచ యుద్ధం 1914–18 తర్వాత వివిధదేశాల్లోని ప్రజాభ్యుదయ వర్గాలూ శ్రామికులూ స్వతంత్రంకోసం చైతన్యవంతులై పోరాడడం మొదలుపెట్టినారు. తర్వాత వచ్చిన ఆర్థికసంకటాలు వారి పరిస్థితిని అసహ్యంచేసి, పోరాటాన్ని మరింత తీవ్రతరం చేసినవి. అందుతో పెట్టుబడి

దారులూ భూస్వాములూ అభివృద్ధి నిరోధకశక్తులన్నీ కలిసి యీ ప్రజావిజృంభణను అణచివేయాలనుకున్నారు. ఆ మాత్రం ప్రజాస్వామికం కూడా నడపడం ఆత్మవినాశకరమని తెలుసుకున్నారు. క్రూరహింసావిధానంతో ఉద్యమాలనణచి రక్తంలో రాజ్యం నడిపించాలనుకున్నారు. సర్వాధికారం దొరకబుచ్చుకోవడానికి తన్నుకున్నారు; తంటాలు పడినారు. ఆ క్రూరహింసా విధానమే ఫాసిజం. వారి దేశీయ ప్రజావర్గాన్ని అణచిపెట్టజాలక యితర దేశాలను దోపిడిచేయడానికి దొంగల గుంపులను తయారుచేసినారు. కొల్లగొట్టడానికి మొదలుపెట్టినారు. దీనికి మూలం ఫాసిజం. ఫాసిజం తీవ్రస్వరూపమే హిట్లరిజం. ప్రపంచ అభ్యుదయ శక్తులకు విరోధంగా తీవ్రహింసా క్రియాప్రతిష్ఠితమైన పశుబల రాజ్యానికే హిట్లరిజమనీ నాజీజమనీ నేషనల్ సోషలిజమనీ నామధేయాలు. హిట్లరిజమంటే, యిప్పుడు అన్యరాజ్య దురాక్రమణగా యితర దేశీయులకు అర్థమవుతుంది. ఇటలీలో తొలుత ఫాసిజం రాజ్యానికొచ్చింది. కానీ సర్వసౌభాగ్యసంపన్నంగా పరిశ్రమలతో శాస్త్రీయ పరిశీలనలతో నిండిన జర్మనీలో ఫాసిజం పొదుకొన్న తర్వాత యిది ప్రపంచాన్ని కబళించడానికి కరాళదంష్ట్రాపూర్ణ ముఖగహ్వరాన్ని తెఱచింది. శక్తివత్తరమైంది. దురాక్రమణకు కాలుదువ్వింది. కాబట్టి హిట్లరిజంతో పోరాడడమంటే ఫాసిజంతో తదనుయాయులతో దానికి మూలమైన సాంఘిక వ్యవస్థతో అభివృద్ధి విచ్ఛేదక భావాలతో — శక్తులతో ఢీకొనడమన్న మాట.

నేడు సామ్రాజ్యతత్వం పూర్వరూపంలో నిలవలేకపోతున్నది. నిలదొక్కుకోవాలనే ఉబలాటంలోనే ఫాసిస్టు రూపం తాల్చింది. యీరోజు ప్రపంచ సామ్రాజ్య ప్రతి

సిద్ధిగా ఉన్న యీ ఫాసిజాన్ని పడగొట్టామూ అందులోనే సామ్రాజ్య తత్త్వాన్నికూడా నడుములు విఱగ గొడుతున్నామన్నమాట. అందుకని సామ్రాజ్యవాదపోరాట మీనాడు ఫాసిస్టు విరుద్ధ పోరాటంలో మిళితమై పోయింది.

ఈ హిట్లరీయ అధికారవర్గ కార్యాలకు నానారకాలైన వివరణలూ బయలుదేరినవి. వేలాదియేండ్లుగా జర్మనీలోవున్న జాత్యహంభావమే యిందుకు కారణమంటారు. అందుకని జర్మన్ల నణచాలనీ సైన్యాక్రమణకిందనే దాని సదాగా ఉంచుకోవాలనీ అంటారు. నిజంగా జర్మనీలో రాబొయ్యే ప్రజా విప్లవానికి బెదటి విజయానంతరం యేర్పడే జర్మనీ ప్రజాప్రభుత్వానికీ నాటినుండీ యెసురు పెడతారు హిట్లరు ఘాతుకకృత్యాలతో కల్గిన సభ్య ప్రపంచ రోషాగ్నిని జర్మన్ ప్రజలపైకి మరలింపజూడడం అక్రమం. విచిత్రమేమంటే యీరకమైన ప్రచారానికి మూలపురుషుడు లార్డు వాన్‌స్టార్టు. యీయన యుద్ధానికి ముందు హిట్లరుకు అతిథి. హిట్లరు ఆయుధబలాన్ని పెంపొందించే పాలసీ ననుసరిస్తూన్నరోజుల్లో 1930–37– ఛేంబర్లేను కాలం—విదేశాంగ శాఖకు కార్యదర్శి. అప్పుడే వర్సెయల్సు సంధి భగ్నంచేయబడింది. ఈయనగారే యిప్పుడేమంటాడనుకొన్నారు: "తరతరాలనుండీ జర్మనీ ప్రపంచాన్నాక్రమించుకోవాలని చూస్తున్నది" ఎంత పరస్పర వైరుధ్యమో కనబడడంలేదూ? జర్మన్ జాతి ఆర్యజాతనీ అది సర్వోత్కృష్టమైనదనీ అనే ఫాసిస్టుల సిద్ధాంత మెంత అర్థంలేనిదో జర్మన్ జాతే యీ దుండగాలకు కారణమనే సిద్ధాంతంకూడా అంతే.

నాజీలు చెప్పే ఆర్యజాతి సిద్ధాంతం ఫాసిస్టు ప్రణాళికలో ఒక భాగం. జర్మనీలో ప్రజావిప్లవా న్నెదిరించే

సాధనంగా బయలుదేరింది హిట్లరిజం. కైజరు పోయినా సేనానులు వారే వీమర్ రిపబ్లిక్కులోనూ ఉన్నారు. సైన్యాధికారులు సన్నసన్నగా ఉన్న 'జర్మన్ వర్కర్స్ పార్టీ'లో కితణ్ణి — హిట్లరును — పంపారు. అదే తర్వాత నాజీపార్టీ అయింది. మొట్టమొదట 'స్టారం ట్రూప్స్'కు — తుపాకు సేవలు—జీతమిచ్చిందీ సేనే. తొలి నాజీపార్టీ పత్రిక 'వోల్కిష్ బీబాష్టర్'కు డబ్బు పెట్టినవాడు, మ్యూనిచ్ రీష్వార్ కమాండింగు ఆఫీసరు జనరల్ ఫాన్ ఏప్. హిట్లరూ నాజీపార్టీ పైకి రావడానికి క్రమంగా సైన్యాధికారులూ, పెద్దపెట్టుబడిదారులూ బాంకర్లూ పోలీసధికారులూ, పారిశ్రామిక ధనికులూ, పాత అధికారవర్గంలోని మొండిఘటాలూ ధనసహాయం చేస్తూ ఆదుకోవడమే కారణం. జర్మన్ సామ్రాజ్యాన్ని వాంఛిస్తూన్న వాళ్ళంతా వీమర్ రిపబ్లిక్కుకు వ్యతిరేకులై సాయపడినారు. కడాపట హిట్లరుకు అధికారాన్నప్పగించినవాడు 'హిండెంబర్గు.' జనసమ్మతికి విరుద్ధంగా పాత కైజరు ప్రభుత్వాని కన్నా దిట్టమైన నియంతృత్వం కావాలనిట్లా చేసినారు. ఈ పన్నుగడలో సోషల్ డెమాక్రటులూ రిఫార్మిస్టులూ తోడుదొంగలైనారు

ఒక్క జర్మనీలోనే కాదు పెట్టుబడిదారీ ప్రభుత్వమున్న దేశాలన్నిటిలో కొంచమో గొప్పో తలసూపింది. 'ధనికతత్త్వం శిథిలమౌతున్నప్పుడు ఫాసిజం కల్గుతుంది' ఇటలీలో — జర్మనీకన్నా ముందే — ఫ్రాంసులో స్పెయినులో జపానులో. జపానులో ఆదేశపు ఫ్యూడల్ సామ్రాజ్యతత్త్వాని కనుగుణంగా మిలిటరిజం రూపంలో ఉన్నది. విషీ ఫ్రాంసులో జర్మ నాక్రమణ తర్వాతనే అయినా వుంది డాక్టర్ [illegible] ల్లులో పొడసూపింది. బ్రిటనులో అస్వాల్డుమోస్లే నాయకత్వంకింద పొటమరల్లింది.

అమెరికాలో డెన్నిస్, ఫాదర్ కాఫ్లిన్, సిల్వర్ షర్టులద్వారా నిక్కిచూచింది. కానీ జర్మనీ బాగా యంత్రపరిపూర్ణమైన దేశం. శాస్త్రీయ అభివృద్ధి యెక్కువ. నిర్మాణయుతమైన ఆధునిక సేనావారం.

వీటిమూలంగా, అధికారానికొచ్చిన ఫాసిజం తలమానిక మైంది. మిగతా దేశాల ఫాసిస్టులు దీనికి తోకలైనారు. ఈ పలుకుబడికి లోనైనారు. ముసోలినీ ఫ్రాంకో పెతాం మానర్కిజమ్ మోస్లే రకమంతా యింతే. అయినా యే దేశం లోనూ హిట్లరుకోసమని పుట్టినవి కా దా ఉద్యమాలు. అక్కడి చారిత్రిక పరిస్థితులబట్టే సరిగ్గా అదే కారణాల వల్లే -ప్రజావిజృంభణ నణచి పెట్టుబడిని కాపాడుకోవాలనే- వచ్చినది.

ఇందువల్ల జాత్యహంభావముమీదనే వచ్చిందికాదు? అట్లయితే జర్మన్లకు జాత్యహంభావముంటే అక్కడమాత్రమే రావాలిగదా. సమాజవ్యవస్థలోనుంచీ వచ్చిందేయిది కానీ పైనుంచీ దిగుమతైన సరుకుగాదు.

జర్మనీలో పొడుకొనడానికి కావలసినన్ని కారణా లున్నవి. అంతఃఉమా కేవలం ఫాసిజం ఒక్క వ్యవసాయ ప్రధానంగా కొద్దిగా యంత్రపరిశ్రమాభివృద్ధి జరిగినచోట్లనే వస్తుందనుకొనేవారు. అభివృద్ధి చెందిన దేశాల్లో కార్మికోద్యమం నిర్మాణయుతంగా వుంటుందికదా అనుకొనేవారు. ఈ ఉదాసీనభావం 1933 లో గాలికి లేచింది. అయినా పూర్తిగా తెలుసుకున్నారా? కమ్యూనిజం వస్తుందేమో అనే అనురేగానీ ఫాసిజం వస్తుందనే బెదురులేదే! చూచారా, బ్లూం ఫ్రెంచి సోషలిస్టు నాయకుడు గదా? 1940 మేలో పెతాం, వేగాం కలిసి తిరగబడుతూంటే, బర్నపాతు కార్మిక

సభలో మాట్లాడుతూ కమ్యూనిస్టులవల్ల ప్రమాద ముందను కొన్నాడు కాని నిరోధకశక్తులు కొంపలుముంచుతాయనే ఊహే కల్గలే దాయనగారికి.

అయినా జర్మనీలోని స్థానిక కారణాలే కాక అంతర్జాతీయ రాజకీయాలుకూడా ఫాసిస్టు విజయానికి బాధ్యములే.

జర్మన్ సామ్రాజ్యతత్త్వం నాలుగున్న రేండ్లు పోరిపోరి మిత్రమండలితో–1918 లో–ఓడిపోయింది. ప్రజావిప్లవం చెలరేగింది. అప్పటికేమో సామ్రాజ్యతత్త్వశక్తులను పీడ గొట్టింది. కైజరు ప్రభుత్వాన్ని పాతిపెట్టింది. కానీ లాభం పొందలేకపోయింది. నిజమైన ప్రజాప్రభుత్వాన్ని నెల కొల్పలేకపోయింది. పైన వర్సైల్సుసంధికి దారిచేసింది. దాంతో మిత్రమండలి జర్మన్ సామ్రాజ్యాన్ని ముక్కలు ముక్కలు చేసింది. జర్మన్ ప్రజాసముదాయాన్ని అణచి పెట్టింది. యీ అర్ధవిప్లవం కానీ వర్సైల్సు సంధి కానీ జర్మనీ సమస్యలను పరిష్కరించకపోగా మరింత క్లిష్ట మొనర్చినది.

జర్మన్ దురాక్రమణభయం పూరా పోవాలంటే, ప్రజా ఉద్యమం విజయవంతంకావాలి. సామ్రాజ్యతత్త్వ పునాదులు బూడాలి. సేనాధికారులనూ నిరోధకులనూ తొలగించాలి. ధనిక భూస్వాముల చేతుల్నుంచీ అధికారం లాక్కోవాలి. ప్రజాప్రభుత్వ నిర్మాణం కావాలి. అది కాలేదు. ఓటమితో ఆర్థికస్థితి భగ్నమైంది. 'ఇన్ఫ్లేషన్' పెరిగిపోయింది. మధ్యతరగతి నడుములు విరిగినవి. ఇవన్నీ ఫాసిజానికి దోహదమైనవి. ప్రపంచమంతటా వచ్చిన ఆర్థికదుస్థితి జర్మనీలో దుస్సహమైపోయింది. వర్సైల్సుసంధి మీదున్న జర్మన్ రోషావేశాన్ని ఫాసిస్టులుపయోగించుకొన్నారు. అంతటికీ అదే కారణమన్నారు. సైనిక ధురధికారాన్ని చలాయిం

చారు. సామ్రాజ్యతత్త్వరథాన్ని అమాయక ప్రజలమీద నడిపారు. వారిలోనే రథాన్నీడ్పించారు.

జర్మన్ షావుకార్లు సరే 'బహుత్ అచ్ఛా' అనుకున్నారు. తమ దురాక్రమణేచ్ఛకూ వ్యాపార పీడనకూ యిదే అగిందను కున్నారు. ఇట్లా 1933లో రక్తపిపాసులూ హంతకులూ ప్రజాహింసకులూ జర్మనీ ప్రజలను చేజిక్కించు కొన్నారు. దేశంలోని వైజ్ఞానికులను వెళ్ళగొట్టినారు. కార్మిక నాయకులను కాల్చినారు – ప్రజాసేవకులను పరిమార్చినారు. సభ్యతంటే కారాలు మిరియాలు నూరి వణికించినారు. ప్రపంచాన్ని గందరగోళం చేసేందు కిది నాంది. తరతరాలుగా జర్మనులు విజ్ఞానానికీ సభ్యతకూ పేరుమోసినవారు. కడకు వారిని బ్రహ్మరాక్షసులుగా చేయడానికి పూనుకొంది ఫాసిజం.

దీనికి మూలం నిరోధకులే కాదు సంస్కారవాదులు కూడా ప్రబలమైన బాధ్యతకలవారే. అంతర్జాతీయ విప్లవ నిరోధక వర్గాలందుకు సాయపడినవి. అంతేకాదు అంతర్జాతీయ విప్లవ శక్తులు దాన్నాపలేక పోయినవి.

ప్రతిదేశంలోనూ – జపాన్ స్పెయిన్ - ఇటలీ - మొన్నటి వఱకూ – కూడా యిదే మూలకారణాలతోనే ఫాసిస్టుల వశమైనవి. అదే ధోరణిలోనే కార్యక్రమాన్ని సాగిస్తున్నవి నేటి మహద్దారుణాగ్నిహోత్రాన్ని రగిల్చి బ్రహ్మాండానికి చిచ్చు పెట్టడంలోకూడా ముసోలినీ టోజో హిట్లరు మూర్తి త్రయ ప్రతిబింబితమైన ఫాసిజం ఒకే ధోరణిలోనే ఒకే మార్గంలోనే సంచరిస్తున్నది.

ఇంతకూ ఫాసిజమంటే నెహ్రూ అన్నట్టుగా 'ధనాఢ్య ప్రాబల్యంకల ప్రభుత్వాహంకారం.'

---

# ఫాసిజం: విధానం

ఫాసిస్టు విధానం యుద్ధం. వారి పాలనా గీతా సూక్ష్మంగా పరిశీలించి చెప్పినమాటే. అంతవరకూ పోకుండా వాళ్ళ నేమాటలు వినండి! చాలు.

"శాశ్వత శాంతి సంభవమనిగానీ ఉపభోగ్యమని కానీ ఫాసిజం విశ్వసింపదు... యుద్ధ మొకక్కటే మానవ శక్తిని పరమోన్నతస్థితికి గొంపోయి అట్టి ధైర్యవంతులను మహాత్వ ముద్రాంకితులను చేస్తుంది."

ము సు లో నీ

"శాశ్వత యుద్ధంలోనే మానవులు ఘనులౌతారు. శాశ్వత శాంతిలో మానవులు నశిస్తారు" హిట్లరు.

జర్మనీలో నాజీలు విజయం సాధిస్తూనే, పడిపోతూన్న పెట్టుబడి కోటను వేలమానవులను బలిచేసి ప్రజాసామాన్య రక్తంతో నిలుపుకొన్నా రనుకోండి. అక్కడి కాగారా? ప్రపంచమంతా తను కిందికి రావాలి. తమకు వలసలుగా దేశాలూ, తమకు బానిసలుగా జాతులూ తయారు కావాలి. అదెట్లా అవుతుంది? మాంచి దిట్టమైన యుద్ధసైనిక యంత్రాం నిర్మితం కావాలి. ఈ దృష్టితోనే ఒక్క సైన్య శాఖే కాదు. పరిశ్రమలూ, విద్యా, ఉత్పత్తీ, పాలనా, సేనావారంగా జనాభా నంతటినీ మార్చడంలో, అన్నిటా మార్పులు తెచ్చినారు. వారి పరమాదర్శం ప్రపంచాక్రమణ. సాధనం యుద్ధం. అందుకు తయారు చేయడమే పాలనా విధానం.

ఈ సంగతి వాళ్ళే చెబుతున్నారు కూడా. జర్మన్ యుద్ధమంత్రివర్గ పరిచరణ శాఖాధిపతి మేజర్ జోష్క్రి 1936లో ఒక కరపత్రం ప్రకటించినాడు. దానిపేరు "నేషనల్ సోషలిస్టు విప్లవపు సైనిక ప్రాముఖ్యం". అపుస్తకానికి యుద్ధమంత్రి జనరల్ ఫాన్ బ్లాంబర్గ పీఠిక రాసినాడు. ఆ కరపత్రంలోని విషయాలకు అధికారముద్ర వేసినాడు. ఆ పుస్తకంలో: "నేషనల్ సోషలిస్టు రాజ్యాంగ విధానం, ఆధునిక యుద్ధతంత్రావసరాలకు అనుగుణమైంది. ఆధునిక యుద్ధానికి రాజ్యాంగంలోని నైతిక శారీరక భౌతిక శక్తులన్నీ కావాలి. అని యీ రచయిత వివరిస్తూ పోయినాడు."

(బెర్లిన్‌లోని టైమ్సుపత్రికా విలేఖరి 27–2–1936)

అట్లాగే 1936లో ముసోలినీ కూడా వివరించినాడు: "నియమిత ప్రణాళికా బద్ధమైన ఇటలీ ఆర్థికతంత్రము ఒక్క భావం మీదనే నడుపబడుతున్నది. దేశమంతా ఒక చక్కని యుద్ధరంగం కాక తప్పదు. యుద్ధ మేవిధంగా యెప్పుడారంభమవుతుందో యెవరూ చెప్పలేరు. కానీ భాగ్యచక్రం గిరగిరా తిరిగిపోతున్నది. ప్రత్యక్షంగానో పరోక్షంగానో జాతీయ రక్షణకై పనిచేస్తున్న పరిశ్రమలకు ప్రజానీకంనుండీ విరాళాలు పోగుచేసి పెట్టుబడి చేకూర్చబడింది. పరిశ్రమలు ధనిక విధానంకన్నా తీవ్రతరమైన పద్ధతిలోనికి అభివృద్ధి చెందినవి ఇవన్నీ ప్రధాన పరిశ్రమలుగా మార్చబడతాయి... ఇతర ప్రజలకు కావలసిన వస్తువుల పరిశ్రమలు సమకూర్చేందుకు వీలూ శక్తీ ఉండని సమయం రాబోతున్నది. సాధ్యమైనంతవరకూ ఇవి కేవలం జాతీయ సైన్యదళానికే పనిచెయ్యాలి."
(23–3–36లో ముస్సోలినీ కార్పొరేషన్ల రెండో జాతీయ సభలో ఉపన్యాసం.)

ఇందువల్ల పాలనావిధానమంతా యుద్ధపరిశ్రమల నభివృద్ధి చేయడానికుపయోగిస్తారు. ప్రజల కేంకావాలో అవసరం లేదు. వారికి వస్తువులను కూర్చడం ఆర్థిక విధాన సమస్య కాదుకదా! ఈ యుద్ధపరిశ్రమలైనా జాతీయం చేయబడినాయా? లేదు అవి ప్రత్యేక వ్యక్తుల స్వత్వంగానే వున్నవి. వీటివల్ల ఫాసిస్టులకు కావలసిన యుద్ధోత్పత్తే కాదు. ధనికులకు కావలసిన దోపిడీకూడా జరుగుతుంది. కావలసినన్ని లాభాలొస్తేసరి. యేవి వుత్పత్తి చేస్తేనేం.

చీనికొక్క దేశీయులే కాదు. యితర దేశాల వాళ్ళుకూడా అనుకున్నారు. వాళ్ళకు కమ్యూనిజ మెక్కడొచ్చి ఖజానా లూడుస్తుందో అనే కానీ యీ ఫాసిజం తమ దేశంలోని పిల్లామేకా ముసలీ ముతకామీద అగ్నిగోళాలు కురిపించి ఒలో లక్ష్మణా అని అలపరింప జేస్తుందనే సందేహమే కల్గలేదు లేకపోతే, తమ ఫాక్టరీలల్లోంచీ ఆయుధ సామగ్రికూడా సరఫరా చేశారు. యేం స్వార్థమనుకోవాలి నాజీ దౌర్జన్యాలను ఉన్న వున్నట్టుగా ప్రచారం చేస్తామంటేకూడా ఊహూఊహూ అన్నారు. వాటిని కప్పి పుచ్చినారు. ఇది మూరకే చెప్పేమాట కాదు నిజం. ఉదాహరణకొక్కటి చూడండి. 'ప్రొఫెసర్ మామ్‌లాక్' అనే నాజీ విరుద్ధ ఫిల్మును ఛత్ చూపించగూడదన్నారు. అంతేకాదు. నాజీ ఖైదుల్లో జరుగుతూన్న అమానుష చర్యలను పత్రికల్లో వేస్తూంటే ఒప్పుకోలేదు. ఇప్పుడేమో నోరు తెరుచుకొని చూస్తూన్నారు. ఏమంటారు? ఏ మన మంటారు? ఇప్పటికైనా పూర్తిగా మారినారా? ఊహూ...హూ? ఈ దినం ఫాసిజం సర్వమానవ సభ్యతా విచ్ఛేదకమని వారిచర్యలే ప్రపంచమంతా దండోరా వేస్తూంటే

గప్‌చిప్‌మని మనసులో సమయాని కాచుకున్న గుంట నక్కలూ లేక పోలేదు.

ఈ ధనవంతులకు తోడు, కొందరు కార్మికపత్ర నామధారులూ మధ్యతరగతి ప్రజా స్వామ్యవాదులూ ఫాసిస్టుల అసత్య ప్రచారానికి మోసపోయినారు. 'నేషనల్ సోషలిజం' అనే మాట వీరిని వంచించింది.

సోషలిజ మంటే: యుద్ధానికీ దరిద్రానికీ ఆలవాలంగా వున్న ఆస్తి స్వత్వంమీద ఆధారపడిన యీ సమాజవిధానాన్ని మార్చి, ప్రధాన పరిశ్రమలనూ ఉత్పత్తినీ జాతీయం గాచేసి ప్రజాసమస్యలను పరిష్కరించే దృక్పథం ఇదే అర్థంలోనే దేశదేశాల నిర్మాణయుత కార్మికోద్యమాలూ ప్రజాస్వతంత్రవాదులూ వాడుతున్నారు. వర్గభేదాన్ని రూపు మాపడం: ఏ వ్యక్తీ ఇంకో వ్యక్తిని పనిచేయించుకొని కూలి కొంచెమిచ్చి ఆ ఉత్పన్న వస్తువులను యెక్కువ కమ్ముకొని మిగిలింది జేబీలోకి వేసుకుంటూ పీడించడం తీసివేయడం, ముఖ్యోత్పత్తిని ఉమ్మడిగా జరపడం - యాజమాన్యం వహించడం, సర్వమానవ సౌభాగ్యం కోసం ఉపయోగించడం సోషలిజమనే పద్ధతివల్ల కలిగే ఫలితాలు. యిట్లా చేయడంతో యేకొందరి చేతుల్లోనో ఉన్న స్వతంత్రం నలుగురికీవచ్చి నిజమైన ప్రజాస్వామ్యం యేర్పడడానికి దారితీస్తుంది యెన్నేండ్లో యెందరో తుపాకీలకూ ఉరికంబాలకూ ఎహుతై సంపాదించుకున్న ఈవున్న పౌరహక్కుల్నే పెట్టుబడిదారీ దేశాల్లో సంకోచింపచేసే బంధనాలున్నాయే ఇవన్నీ తెగిపోతాయి. భావి స్వేచ్ఛా అభ్యుదయానికి పునాదియేర్పడుతుంది. ఉత్పత్తిలో ప్రతివాడూ పాల్గొన్నట్లే అనుభవంలోనూ శక్తికొద్దీ తాను భాగస్వామి అవుతాడు. ఇందుతో వర్గ పీడన అంతమొందుతుంది. మనిషి స్వతంత్ర పౌరుడౌతాడు.

ఫాసిజంలో: వర్గభేదం బలవంతంగా పశుబలంతో ప్రజల నెత్తిపై రుద్దబడుతుంది. పెట్టుబడిదారీ ప్రభుత్వాల్లోవున్న కార్మిక హక్కులుకూడా తొలగింపబడతాయి. వర్గసామరస్యమంటూ కార్మికులను ధనికవర్గపు సంకెళ్ళలో యిరికిస్తుంది. ఉత్పత్తి సాధనాలు ధనాఢ్యుల చేతుల్లోనే వుంటాయి. యెక్కడ పీడితవర్గం విజృంభిస్తుందని అనుమానం తోచిందో, నమరూ బెదురూ, నీతినియమం దయా దక్షిణ్యాం యేమాత్రం లేకుండా పశుబలంతో ఉన్న అధికారాన్ని నిలుపుకొంటుంది అధికారవర్గం. ప్రజా స్వతంత్రపు నేమాట కలికానికీ మిగలదు. నిఘంటువుల్లో తప్పా కనపడదు. సభ్యతా గిభ్యతా గిట్టదు. హింసాపాలనం ప్రపంచదు రాక్రమణ చెలరేగిపోతాయి. వాళ్ళ కేలాంటివాళ్ళు అధికారులు కావాలంటే:

"మాకో నూతన పాలకవర్గం కావాలి. అదెట్లాంటిదంటే: తమ జాతి ఉత్తమం గనక, తన్మూలంగా పాలించే హక్కు తమది. ఈసంగతి గుర్తించి, అడ్డూ అగీ లేకుండా యేవిధంగానైనా సరే ప్రజా పాలనాన్ని గుంజుకొని రక్షించుకొనేందుకు అర్హంగా వుండవలెను."

(హిట్లర్: ఈమాటలను కోనాడ్ హీడన్, 'నేషనల్ సోషలిజం చరిత్ర'లో ఉదహరించినాడు.)

పాపం కొన్నాళ్లు కొందఱు ధనికులూ భుస్వాములూ కూడా సోషలిజం అనే మాటను చూచి గాభరాపడినారు. హిట్లరిజమూ సోషలిజమే ననుకొన్నారు. తర్వాత అర్థమైంది వరెవరే మనవాడేరా వీడు అని వేలు కొలుచుకున్నారు. ఇంక మనమూ చేయికలపాలిసిందే అని అందఱూ తలో చేయి పట్టి నాజీ బ్రహ్మరాక్షసికి బ్రహ్మరథం పట్టినారు. జర్మన్

ఘన పరిశ్రములు పత్రిక 'డ్యూష్ బెర్గ్‌వర్క్స్ జై టంగ్' 13-8-1933 లో యీ మాటలు వ్రాసింది. "ధనికవర్గం లోని చాలామంది హిట్లరుద్యమానికి తోడుపడనీకుండా చేసింది, 'సోషలిజం' అనే మాట......ఇది కేవలం పొర పాటని నేడు తెలిసి పోయింది. నూతన ప్రభుత్వవిధులు, మన మూడో పార్లమెంటు చెప్పే సోషలిజం, మార్క్సిజం చెప్పే 'సోషలిజానికి' పరమ విరుద్ధమని నేషనల్ సోషలిస్టు ప్రచారంకన్నా స్పష్టంగా చూపించినవి."

. హిట్లరుకు పెద్ద పెద్ద బాంకర్లు సహాయం చేస్తున్నారనే సంగతి 1924 లో హిట్లర్-లుడెండార్ఫ్ విచారణలోనూ, బవేరియన్ డయట్ ఇన్వెస్టిగేషన్ కమిటీ విచారణలోనూ తేలిపోయింది. విదేశాల్లోనూ డీటర్డింగు, క్రూగర్ ఫోర్డు వగైరాలున్నారని తెలిసింది.

ఫ్రెంచి ఛేంబర్ ఆఫ్ డెప్యూటీసులో ఫిబ్రవరి 11, 1932 పాల్ ఫార్ తెల్పిన సంగతిసిబట్టి ష్నైడర్ క్రూసల్ యాజ మాన్యం కింద పనిచేస్తూన్న స్కోడా ఆయుధ కర్మాగారం- జెకోస్లోవేకియా - డైరెక్టర్లుకూడా నాజీలకు ధనసహాయం చేశారని తెలిసి పోయింది. బొగ్గు గనుల యజమానుల సంఘ స్థాపకుడూ ఉక్కు కంపెనీ అధ్యక్షుడూ ఆయిన కిర్డార్ఫ్ నాజీపార్టీలో 1927 లో సభ్యుడైనాడు. 1931 లో బొగ్గు యజమాన్ల సంఘు మొక తీర్మానం చేసింది. ఒక్కొ టన్ను బొగ్గుకు అరు పెన్నీల ప్రకారం నాజీ ఫండు.కివ్వాలి. బొగ్గు ధరనుకూడా యెక్కించా లిందుకోసమని. యీ చందా 1932 యెన్నికలకుగాను 30 లక్షల మార్కులకు పైగా ధనం సమకూర్చింది.

ఈ పెద్ద బాంకర్లకు నూతన జర్మనీ రాజ్యంలో యెంతో ప్రాధాన్య మిస్తున్నారు. నాజీ ప్రభుత్వం నియమించిన

'సుప్రీమ్ కౌన్సిల్' — ఉత్తమ ఆర్థికసభ-లో యీ క్రింది ముఖ్యులు సభ్యులుగా వున్నారు.

హెర్ కుప్ వాన్ బోలె ఆయుధరాజు, స్వంత ఆదాయం 6,000,000 పౌనులు. పెట్టుబడి, 150,000,000 పౌనులు

హెర్ ఫ్రిట్జ్ థిస్సేన్, ఉక్కు చక్రవర్తి. స్వంత ఆదాయం 6,000,000. జర్మన్ స్టీల్ట్రస్టు 140,000,000 పౌనులు.

హెర్ యఫ్. శి. వాన్ సీమెన్సు, విద్యుచ్ఛక్తి రాజు; స్వంత ఆదాయం 6,500,000 పౌనులు. పెట్టుబడి 12,500,000 పౌనులు.

ప్రొఫెసర్ కారల్ బోష్, రంగుల కోటీశ్వరుడు; స్వంత ఆదాయం 6,000,000 పౌనులు. పెట్టుబడి 140,000,000

హెర్ ఎ. వోగ్లర్ జర్మన్ ఉక్కు యజమాని. 6,000,000 పౌనులు. పెట్టుబడి 140,000,000 పౌనులు.

హెర్. ఎ డీహాన్ పొటాష్ సిండికేట్ డైరెక్టరు; పెట్టుబడి 10,000,000 పౌనులు.

హెర్ బోషింగర్, డైరెక్టరు, మాక్సు మిలియన్ ఉక్కు పరిశ్రమలు. పెట్టుబడి 1000,005 పౌనులు.

హెర్ యఫ్ వాన్ ష్రోడరు బాంకరు.

హెర్ ఎ. వాన్ ఫింక్ బాంకరు.

హెర్ యఫ్ రీన్ హార్డట్ బాంకరు.

ఇంతేకాదు 1932–37 మధ్యలో జర్మనీలోని లక్షాధికారులు 1266 మంది. కోటీశ్వరులు 180 మంది. "ఆర్థిక

సంకటాలలో సన్నగిల్లిన కోటీశ్వరుల జాబితా తిరిగి "పెరుగుతూ" వుందని 1938 మే లో న్యూయార్కు టైమ్సుపత్రిక బెర్లిన్ ప్రతినిధి వ్రాశాడు "ఇండస్ట్రియల్ కంబైన్ల బలాన్ని తగ్గించడానికి హిట్లరేమీ చెయ్యలేదు. సరికదా పైగా అతని నాలుగేండ్ల పరిపాలనలో ముఖ్య విషయం: ఘన పరిశ్రమల్లో సూపర్ ట్రస్టులు పెంపొందడమే." అని యస్. హెచ్. రాబర్టు – సిడ్నీ విశ్వవిద్యాలయం ప్రొఫెసరు – 'హిట్లరు నిర్మించిన భవనం' అనే పుస్తకంలో (1937) వ్రాసినాడు.

ఫాసిస్టు బాంకర్ల లాభాలు దిక్కులేకుండా పెరిగి పోతున్నవి. యుద్ధం వచ్చినాక మరీ విపరీతంగా దోచుకుంటున్నారు. పోనీ యింకా ముందు నాలుగేండ్ల నాజీపాలనలో యే మాత్రం వచ్చిందో చూస్తే ఫాసిస్టు పాలన యెలా బాంకర్లకు తోడునీడో తెలుస్తుంది. జర్మనీలో ప్రధానమైన వ్యాపార సంస్థలు 50. ఒకొక్కదాని వాటా మొత్తం. 2100,000,000 మార్కులు. ఆదాయం 1934 లో 124,000,000 మార్కులు. 1937 కు 158,000,000 మార్కులకు పెరిగింది. డివిడెండులు 85,000,000 మార్కుల నుండీ 132,000,000 మార్కులకు హెచ్చినవి. అధికార సూచికల ప్రకారంకూడా జర్మన్ పరిశ్రమల వాటాల ధరలు (నెలసరి సగటున) 1932 లో 40. 3. 1938 లో 84. 8. యుద్ధం మూలంగా 1940 లో 98. 1941 నవంబరులో 119, పెరిగిపోతూనే వుందిట్లా.

ఇవన్నిటివల్లా ఫాసిజం పెట్టుబడిదారులకు కట్టుకోటని తెలుస్తుంది. వాళ్ళ యాజమాన్యాన్నింకా భద్రపఱచేదే. ఘన మనుకున్నట్లు విధిలేని పరిస్థితిలో హింసా విధానంతో

యాజమాన్యాన్ని నిలుపుకోడానికి పన్నిన పన్నుగడే. దీనికి నేషనల్ సోషలిజమనేది నామ మాత్రమే కానీ సోషలిజానికీ దీనికీ యేమాత్రమూ సంబంధం లేనేలేదు.

ఇటలీలో పరిశ్రమల వాటా సూచిక ప్రకారం 1932లో 44. 6. 1938 లో 84. 6. మాంటెకాటిని అనే ట్రస్టు ఆదాయం 1935 లో 67. 4. మిలియన్ లీరాలు. 1938 లో 148. 6. మిలియన్ లీరాలు.

జపాన్‌లో 1931 లో 62. 2. నుండీ 1938 కి 132 9. 1940, 137.

జర్మనీ వాటాల ధరలు 1940 ఏప్రెలుకూ 1941 ఏప్రెలుకూ 20 వంతు లెక్కువైనవి. (లీగ్ ఆఫ్ నేషన్సు ప్రపంచ ఆర్థిక వివరణ 1939–1941).

క్రుప్సు అనే కోటీశ్వరుని లాభాలు 1933 లో 395000000 మార్కులు. 1940 లో 4210000001 జర్మన్ స్టీల్‌ట్రస్టు ఆదాయం 1939 లో 222000000 మార్కులు. 1940లో 260,000,000 మార్కులు. అ. టే 19000000 పౌనులు

ఇంతైనా వాళ్ళ రాజ్యాంగ ఆర్థిక పద్ధతుల కతీతమైందట. "ఫాసిస్టుల దృష్టిలో రాజ్యాంగ మొక ఆధ్యాత్మిక నైతిక సత్యం" అంటాడొకడు — ముసులోనీ. "రాజ్యాంగ యంత్రాని కొక నిర్ణీత ఆర్థిక విధానంతో సంబంధం లే"దంటాడు మరొకడు (హిట్లర్). కానీ జరుగుతున్నది పై లెక్కల్ల వల్ల మనకు తెలుస్తూనే వుంది. ఇంత అబద్ధాలు మోసం వంచన యెక్కడా చూడలేము. ఇదీ 'నూతన సమాజ పద్ధతి!'

పోనీ షావుకార్లిలా పెరిగిపోతున్నారు కదా యింక కార్మికుల స్థితి యెట్లా వుంది అనేది మనం తెలుసుకుంటేగానీ యీ విషయం పూర్తికాదు. అధికారానికి వచ్చేముందు

వీరిచ్చిన నినాదాలకూ తర్వాతి నిజ పరిస్థితులకూ సంబంధమే లేదు. పైగా పరమ విరుద్ధంగా నడిచినారు.

1920 లో నాజీపార్టీ 25 సూత్రాలలో ఒక కార్యక్రమా న్నిచ్చింది. 1926 నాజీ కాంగ్రెసు వానినట్లే అంగీకరించింది. ఆ సూత్రాల నెట్లా ఆచరణలో పెట్టినారో చూద్దాం:

| కార్యక్రమం | జరిగిన పని |
|---|---|
| 1 సూత్రం "జాతుల స్వయం నిర్ణయ సూత్రం మీద ఆధారపడి జర్మన్లందరూ గ్రేటర్ జర్మనీగా నిర్మాణం కావాలి." | యూరోపును దౌర్జన్యంగా దురాక్రమణ చేసినారు. |
| 11 సూత్రం "సంపాదించిన లాభాన్ని రద్దు చెయ్యాలి. వడ్డీ భోగ్యంపనిని తీసి వెయ్యాలి." | 1932–37 లో కోటీశ్వరులు 190 కి పెరిగినారు. |
| 12 సూత్రం "యుద్ధాదాయాలన్నీ స్వాధీనపరుచుకోవాలి" | క్రుప్పు ఆదాయం 1940 లో 421000000 మార్కులు. |
| 13 సూత్రం "ట్రస్టులన్నిటినీ జాతీయం చెయ్యాలి." | "హిట్లరు నాలుగేండ్ల పాలనలో కనిపించే ముఖ్య విషయం: ఘన పరిశ్రమల్లో సూపర్ ట్రస్టులు పెంపొందడం" |
| 17 సూత్రం. వడ్డీ వ్యాపారులనూ ప్రాఫిటీర్లనూ — క్లిష్ట | కమ్యూనిస్టులనూ సోషలిస్టులనూ కార్మిక నాయకు |

పరిస్థితుల నుపయోగించు లనూ ఉరితీశారు.
కొని దిక్కులేని లాభాలు
కొట్టేవాళ్ళు — ఉరితీయాలి.

కార్యక్రమమూ ఆచరణమూ సంబంధం లేదు అధికారానికి వచ్చిం తరవాత 'లేబర్ కోడ్డును' యేర్పఱచినారు. అందులో కార్మికుల స్థానం నిర్వచింపబడినది.

1 సూత్రం: "పరిశ్రమల ఒడంబడికలో యజమాని నాయకుడుగానూ, కార్మికులు అనుచరులుగానూ యేకమై దాన్ని పెంపొందించేందుకూ, జాతి రాజ్య సౌభాగ్యానికీ పనిచేయ వలెను."

2 సూత్రం: "నాయక అనుచరులలో, పరిశ్రమలకు సంబంధించిన యావన్నిర్ణయాలూ నాయకుడే చెయ్యవలెను"

(జాతీయ శ్రమనిర్మాణ చట్టం జనవరి 1934)

పూర్వమున్న కార్మిక సంఘాలు రద్దుచేసి వాటి నిధులు స్వాధీనం చేసుకున్నారు. లేబర్ ఫ్రంటు — కార్మికసమితిని — యేర్పఱచినారు. అందులో యజమానులూ కార్మికులూ కలిసే వుంటారు. అధికారం నాజీలది. వారే వీని అధికారులను నియమిస్తారు. ఎన్నికలు లేవు. పోనీ యీ సమితికైనా యేమీ హక్కుల్లేవు. కూలి, పనిగంటలు, కూలోళ్ళ పరిస్థితులు ఇటువంటి వాటిలో యీసమితి కల్పించుకో కూడదు. కార్మిక సంఘాల కిస్తున్న చందాలూ కమిటీకే ఇవ్వాలి. అందులో 250 లక్షల మెంబర్లు. అడబ్బంతా నాజీపార్టీకే యెక్కువ పోతుంది. యీ సమితికీ నాజీ పార్టీకీకూడా ఒక్కే కోశాధిపతి. యే కొద్దో 'ఆనందంలోనే బలం' లాంటి ఉద్యమాలకు ఖర్చు పెట్టేవారు. వాళ్ళు స్పష్టంగానే కార్మి

కుల కేలాంటి వసతులూ చేయలేమని చెప్తారు. 'అదర్శ' లేవో ప్రసాదిస్తుందట.

"మేము పనివారి కేమీ కల్పించలేము. మన జర్మనీ పేద రాలు. భీభత్సంగా వుంది. బాధాదూనమై వుంది. కూలిలో కొత్తరేట్లు ఇలాంటివేవీ సాధ్యమే కాని సంగతులు" 'అద ర్శంతోనే' బలం. అనే ఉద్యమ నాయకుని రిపోర్టు మార్చి 1935.

అందుకోసం వారు చేయగలిగింది కార్మికుల దృష్టిని ఆకా శం వైపు తిప్పటం "వారిదృష్టి సందుకు బదులుగా జాతీయ ఆదర్శాలవైపు తిప్పాలి"

విప్లవం ద్వారా ఒక కౌన్సిలు పెట్టుకునే హక్కును కార్మికులు సంపాదించుకున్నారు. అవి హిట్లరు పీకిపారేసి 'రహస్య సంఘాలు' అని ఏర్పాటుచేశాడు. అవి యజమానునికి సలహా సంఘాలు. యజమానే నామినేట్ చేస్తాడు. అదీ 'విప్లవ దృక్పథం'లేని కార్మికులలో నుంచీ. ఇవి సలహా సంఘాలు మాత్రమే అదీ అతనడిగితే. అతనా సలహాను తిరస్కరించను కూడా వచ్చు.

"ప్రతి సంఘానికీ వున్నట్టే పరిశ్రమల్లోనూ ఒక్కడే నాయకు డుండగలడు; అతడే నిర్ణాయకుడు. ఆర్థిక సాంఘిక విషయాలన్నిటికీ అతడే బాధ్యుడు......అతని నిర్ణ యాల్లో సలహా తీసుకొనడానికి మాత్రమే 'రహస్య సంఘా ల' సహాయాన్నపేక్షిస్తాడు. కానీ యివి అతని నిర్ణయాల సంపూర్ణ బాధ్యతను తొలగించలేవు. అనుచరుల ప్రయోజ నాలు పరిశ్రమ సంఘాల ప్రయోజనాలకు వెనుక నుంచ వలసినవే. పరిశ్రమ — ఆర్థిక అవసరాలకు లోబడి వుండ వలసినవే."

బ్రిటన్‌బర్గ్ జిల్లా — ఆఫ్రికా — లేబరు ట్రస్టు అధికార ప్రకటన.

జీతాలు ఆయా కంపెనీలనుబట్టీ పనినిబట్టీ అంటే యజమాని యిష్టాన్నిబట్టీ నిర్ణయిస్తారు. ఆఖరు నిర్ణయం లేబరు ట్రస్టీది. లేక జిల్లా నియంతది. వారిని నాజీ ప్రభుత్వం నియమిస్తుంది. ఒక్క ఉదాహరణం: పెద్ద మిల్లు యజమాని కుర్ప రూర్ ప్రదేశానికి లేబర్ ట్రస్టీగా నాజీ ప్రభుత్వం నియమించింది. సంపూర్ణ సర్వాధికార విరాజితమైన అధికార పదవికి మిల్లు యజమాని నియమింపబడడం, కార్మికులను గూర్చిన సర్వనిర్ణయాలూ అతని కివ్వడం మూలంగా, పూర్వం యేండ్లతరబడి నానా కష్టాలకోర్చి కార్మికోద్యమం సంపాదించుకున్న సామాన్య హక్కులుకూడా మంట గలిసినవి.

“మున్నెన్నడూలేని దారుణ నిరంకుశ పశుత్వం మొదట్లో వుండేది. అప్పుడు కానీ, ఎంతటీ ప్రమైన కార్మికుల తగాదాల్లో కానీ యే రాతిగుండె యజమానికూడా ప్రభుత్వాన్నింక కంటే యెక్కువిమ్మని కోరనే లేదు”. అని అమెరికన్ వ్యాఖ్యాత ప్రొఫెసరు ఆర్. ఎ. బ్రాడీ రాసినాడు. (జర్మన్ ఫాసిజం నిర్మాణమూ ఉద్దేశ్యమూ).

ఈ లేబరుకోడ్డు ఆచరణలో కొచ్చింది 1934లో, అప్పటికి ఇటాలియన్ జర్మన్ ఫాసిజాలు కలుసుకోలేదింకా. ఇటలీ ఫాసిస్టు పత్రిక ‘లవరో ఫాసిస్టా’ యీ లేబరు కోడ్డును గూర్చి యిలా వ్రాసింది:

“జర్మన్ నేషనల్ సోషలిజం కార్మికులను కాళ్ళుచేతులు కట్టివేసిన ధనికతత్త్వాని కప్ప చెప్పింది......మధ్యయుగాన్ని ప్రతిబింబించింది. గడచిన నూరేండ్లుగా కార్మికులు పోరాడి సంపాదించుకున్న దల్లా నాశనం చేసింది.”

తమ ఆదర్శం దోపిడీ యుద్ధమూ. అందుకు ద్రోహం మొండితనం, విశ్వాసఘాతకత్వం, ప్రత్యక్ష రాక్షసత్వం దారి చూపినవి. జనాన్ని వంచించే శక్తి అబద్ధాలు చెప్పే సాహసమూ ఫాసిస్టుల సొక్కు. ఏం పడితే అది వాగ్దానం చెయ్యడం, మరీ తమ కిష్టం వచ్చినట్టు చేయడం. మన జాతి జర్మన్ ఆర్యజాతి ప్రపంచాన్నేలమని భగవంతుడు మనల్ని సృష్టించాడు అని ప్రచారం చేసి చేసి మత్తెక్కించడం. యువకులను చిన్నప్పటినుంచే, బళ్ళల్లోంచీ. యుద్ధానికి సరి చేయడం. పిఱికివారి గుండెలు పిండివేయడం. నిలబడిన ప్రతిపక్షులను నానా బాధలుపెట్టి యెక్కడికీ కాకపోతే కాల్చి పారేయడం. ఇవీ ఫాసిస్టు విధానా న్నమలుపఱచే పద్ధతులు.

హిట్లరు జనసమ్మతిమీద అధికారానికి వచ్చినాడనేది నాజీలు చెప్పే కట్టు కథ :

1932 నవంబరులో హిట్లరు అధికారానికి రాకముందు ఎన్నికలు జరిగినవి. 584 సీట్లకుగానూ నాజీపార్టీకి 196 సీట్లు మాత్రమే వచ్చినవి. సోషల్ డెమాక్రట్లుకూ కమ్యూనిస్టులకూ కలిసి 221 సీట్లు వచ్చినవి మరీ 1933 మార్చిలో యెన్నికలు జరిగాయి. అప్పటికి హిట్లరు అధికారానికొచ్చినాడు. కమ్యూనిస్టు పార్టీని అణచి వేసినారు. కమ్యూనిస్టు సోషలిస్టు పత్రిక లాపివేయ బడినవి. ఎక్కడ జూచినా హింసా విధానం రాజ్యం చేస్తుండినది. అప్పు డెన్నికలు. కానీ యిన్ని వున్నా 647 సీట్లకుగానూ 288 స్థానాలు మాత్రమే నాజీలకు దక్కినవి.

1932 లో జరిగిన ప్రెసిడెంటు ఎన్నికల్లో హిట్లరు నిలిచినాడు. అతనికి వచ్చిన ఓట్లు 13. 4 మిలియనులు. వ్యతిరేకంగా వచ్చిన ఓట్లు 23 మిలియనులు. హిట్లరును పారదోలా

అని హిండింబర్గుకు ప్రెసిడెంటును చేస్తే యీయనే పార్లమెంటు చట్టాన్ని రద్దుచేసి ఎవరి సమ్మతీలేకనే హిట్లరుకు రాజ్యం కట్టబెట్టాడు. అంతా పెద్ద పెద్ద భూస్వాములూ వర్తకులూ సేనానులూ చేసిన గూడుపుఠాణి ఫలితమే యిది.

అధికారానికి వస్తూనే అతివాదులందరినీ జైల్లో వేశినారు. పౌరస్వతంత్రాలన్నీ తీసివేసినారు. ఆ తర్వాత మరీ ఘనంగా జరుగబోయే దారుణ హింసా నాటకానికిది నాందీ.

కానీ యింతా చేస్తూనే యేమేమో చేశామని ప్రగల్భాలు కొడుతూంటారు నాజీలు. నిరుద్యోగాన్ని రూపుమాపామంటారు. నిజమేమిటి? ప్రపంచంలో పెద్దగా 1932లో వచ్చిన ఆర్థిక సంక్షోభం 1932–37 మధ్య అన్ని ధనికరాజ్యాల్లోనూ కాస్త ఉపశమించింది. తెప్పరిల్లు కొన్నవి ప్రభుత్వాలు. ఇదేమంత ప్రత్యేక వైశిష్ట్యం కాదు. అందులో యుద్ధ నిర్మాణం. దిక్కులేనంత మందిని సైన్యానికి చేర్చారు. ఆయుధ నిర్మాణ సంస్థలను పెంపొందించారు. ముఖ్యమైన రోడ్లను నిర్మించారు. ఇందుతో కొంత పని కలిగింది. పైగా తిండిమాత్రం పెట్టి వెట్టిచాకిరీ చేయించుకున్నారు యిన్ని చేసినా దేశీయాదాయం యుద్ధ ప్రయత్నాల కెంత తగలెయ్యబడుతూందో చూస్తే యీ నిరుద్యోగ నివారణేమిటనిపిస్తుంది. అదీగాక, స్వదేశ రక్షణకు కాక పరదేశ భక్షణకు తయారుచేసే యీ సైన్యంవల్ల నిరుద్యోగం పోతే మాత్రం శాంతి కలిగేదేముంది?

జర్మనీ ఆయుధోత్పత్తి ఖర్చు 1933—37.

| సం॥రం | ప్రభుత్వ ఖర్చు | ఆయుధ ఖర్చు మార్కులు | ఆయుధ ఖర్చు పౌనులు |
|---|---|---|---|
| 1933-34 | 9700,000,000 | 3000000000 | 250000000 |
| 1934-35 | 12200000000 | 5500000000 | 460000000 |
| 1935-36 | 16700000000 | 10000000000 | 830000000 |
| 1936-37 | 18800000000 | 12600000000 | 100000000 |

(మార్కంటే రూపాయకన్నా కొంచె మెక్కువ.)
(ది బాంకర్, ఫిబ్రవరి 1937).

దీనినిబట్టి రానురానూ యెంత విపరీతంగా యుద్ధ ఖర్చులు పెరిగి పోయినవో తెలుసుకోవచ్చు. దేశసౌభాగ్యానికిగాక పరదేశ నాశాని కింత దేశధనాన్ని పాడుచెయ్యడం హాని కానికే చేటవుతుంది. ఇంతచేసినా యిందువల్ల దేశీయ ఋణం మూడింతలు పెరిగింది. ఇందుతో ఆర్థిక సంక్షోభం తీవ్రతరమైందే కానీ తగ్గలేదు. అందుకే యుద్ధం రావలసి వచ్చింది.

"ఆయుధ నిర్మాణ కార్యక్రమం ఆఖరు కావచ్చింది కనుక యింక జర్మన్ ప్రజలకు నిరుద్యోగమూ పుష్టికర ఆహార అభావమూ తప్పదు......జర్మనీ యుద్ధంలో ఊపిరి తిప్పుకోగల దంటున్నారు" అని 'బాంకరు' పత్రిక 1937 ఫిబ్రవరిలో వ్రాసింది. ఆయుద్ధ :ఆరంభమే 1936 లో రైన్లాండు సైన్యాక్రమణలో ఆరంభమైంది. 36-37 స్పెయిన్, 1938 వసంతంలో ఆస్ట్రియా, 1938 శరత్తులో సుడేటన్ లాండు, 1939 వసంతంలో జెకోస్లొవేకియా ఆహుతైనవి.

1939 వసంతానికల్లా ఆర్థిక సంక్షోభం మరీ తీవ్రమైంది. దీనికింక యుద్ధమే నివారకమని నాజీనాయకులు ప్రకటించినారు. 1939 మార్చి 12 వ తేదీ లేబరుఫ్రంటు నాయకుడు 'లే', మ్యూనిచ్‌లో జరిగిన బహిరంగసభలో ఏం చెప్పినాడంటే:

"సోదర కార్మికులారా, మీరీ సంకుచిత ప్రదేశంలో నివసిస్తుండి నారంటే మీలో మీరే తిరిగీ కొట్టుకోవలసి వస్తుంది. మార్క్సిజం మరీ తలెత్తుతుంది.....కాలం పరిపక్వ మైంది."

జర్మనీలో సమాజ పునర్నిర్మాణం జరగనీకుండా చేసేందుకు మార్గం యూరోపు దురాక్రమణ యుద్ధంగానే వారికి తోచింది. కారణం తమ దేశంలో యథాప్రకారం పీడన జరుగుతూనే వుండాలి. ఆర్థిక సంక్షోభం తగ్గాలి.

అవల పోలెండు ఆక్రమణా ప్రపంచ యుద్ధమూ.

సోవియట్ యూనియన్‌పై దాడి 1941 జూన్ 22 వ తేదీ ఆరంభించినారు. ఇందుతో యుద్ధంలో తీవ్రమైన మార్పు వచ్చింది. ఆ సంగతి మరీ విచారించొచ్చు.

ఇంతకూ తేలిందేమిటి? ఫాసిస్టు పాలన బలవంతంగా వచ్చిందే కానీ ప్రజల సమ్మతిపై రాలేదు. కార్మికులు నీచ స్థితిలో ఏ హక్కులూలేక పడి వున్నారు. పెట్టుబడిదారీ విధానం బలపడింది. ప్రజా హక్కులు పూర్ణ శూన్యమైనవి. యుద్ధోత్పత్తితో ఆర్థిక సంక్షోభం తగ్గించ ప్రయత్నించినారు. కడకు దురాక్రమణ యుద్ధంలో ప్రపంచాన్నాక్రమించి తమ దేశంలోని ప్రజాసామాన్యాన్ని కాక అందటినీ బానిసలను చేసి దోచుకోనెందు కారంభించినారు. ఇదీ ఫాసిస్టు రాజ్యాంగ విధానం.

ఇటలీలోనూ అంతే జరిగింది :

ప్రపంచ యుద్ధం తర్వాత విప్లవ తరంగాలు లేచినవి. అసెంబ్లీలో 508 స్థానాలకుగానూ సోషలిస్టులకు 156 సీట్లు వచ్చినవి. 1920 మునిసిపలు యెన్నికల్లో 2000 కమ్యూనిస్టులు అధికారం పొందినారు. 1920 సెప్టెంబరులో ఉత్తర ఇటలీలో కార్మికులు ఫాక్టరీల నాక్రమించుకున్నారు. అగష్టు అఖరులో మిలాన్‌లో అరంభమై 35 లక్షల మంది కార్మికులు ఫాక్టరీలు పట్టుకొని తమ స్వంత కమిటీలనూ రక్షణసైన్యాన్నీ యేర్పరుచుకున్నారు. బూర్జువా వర్గం సంస్కారవాదులను శరణు జొచ్చింది.

సెప్టంబరు 11 వ తేదీ సోషలిష్టు పార్టీ, కాన్ఫెడరేషన్ అఫ్ లేబరూ కలిసి ఒక నిర్ణయానికి వచ్చినారు ఓటుపెడితే కాన్ఫెడరేషన్ అఫ్ లేబరే అధిరాకానికి వచ్చింది. జీతాలు 20% యెక్కువచేసే షరతుమీద ప్రభుత్వంతో రాజీచేసుకొని కార్మికుల సమ్మెను అంతం చేసివేసినారు. అనుత్సాహం ప్రజల్లో యెక్కువయింది. నవంబరులో ఫాసిస్టులు హింసావిధానంతో తిరగబడినారు. అఘోరాలు చెప్పలేము.

1921 జనవరి నుండీ మే నెలవఱకూ జరిగిన హింసావిధానం సోషలిష్టుపార్టీ ప్రకటించింది : 120 కార్మికుల నివాసాలు ధ్వంసమైనవి. 243 సోషలిష్టు కార్యాలయాలూ స్థానాలూ నేలమట్టమైనవి. 202 మంది కార్మికులు చంపబడినారు. 1144 మంది గాయపడినారు. ప్రభుత్వం 2240 మందిని అరెస్టు చేసింది. 162 ఫాసిస్టులను కూడా.

అగస్టు 3, 1921 ఫాసిస్టు సోషలిస్టు సంధి జరిగింది. కమ్యూనిస్టులు దీన్ని అత్మహత్యాప్రాయమని చేరలేదు 1922 లో సోషలిస్టు పార్టీ నాయకుడు తురాతీ రాజును కలుసుకొని మంత్రివర్గా న్నేర్పరుచాలని చూస్తే కుదరలేదు.

ఇంక "జనరల్ స్ట్రైకు" సర్వవ్యాప్త సమ్మె - చేయమన్నారు. అంతా అణగిపోయి నిరుత్సాహం ప్రబలిన దశలో సాధ్యమా? 1922 అక్టోబరు 28 తేది రోము మీద దాడికి ఫాసిస్టులు తయారైనారు ఫాక్టా కాబినేట్ రాజీనామా నిచ్చింది ముసులోనీ 1922 అక్టోబరు 30 వ తేదీ రోములో ప్రవేశించి మంత్రివర్గాన్నేర్పఱచి 1926 కల్లా సర్వతంత్ర స్వతంత్రుడైన నియంత అయినాడు.

అంటే ఇటలీలోకూడా ప్రజా సమ్మతిపైన ఫాసిజం రాజ్యానికి రాలేదు. వచ్చిం తర్వాత జర్మనీలో లాగే కార్మికులకు, సమ్మెహక్కు, స్వసంఘాల నేర్పఱచుకొనే హక్కు, తొలగించి 'కార్పొరేషను లు' అనే సలహా సంఘాలను యజమాని అధ్వర్యం క్రింద యేర్పఱచినారు. ఇవి జర్మనీ సలహా సంఘాల లాంటివే.

తర్వాత యుద్ధ వాతావరణం యేర్పఱచడం యుద్ధ పరిశ్రమలకు దేశ సౌభాగ్యాన్ని బలివ్వడం ఒకటే వరసలో జరిగింది. దురాక్రమణ అబిసీనియామీద ఆరంభమై ఫ్రాన్సు మీదపడి, తర్వాత పూర్తిగా అక్షరాజ్య యంత్రంలో మిళితమైంది.

ఇదెంత జన సమ్మతిమీద యేర్పడలేదో, మొన్న ముసోలినీ పతనంతో తెలిసి పోయింది. ప్రజల్లో యే మాత్రం సానుభూతి కనబడలేదు. కడకు ఇటలీలో ఫాసిజం కూలి పోయింది కదా.

---

Annotation ognon S. Balazer

# ఫాసిజం: సిద్ధాంతం

విశ్వమానవకోటి కంతటికీ విరోధిగా పరిణమించిన యీ ఫాసిజం ఆదర్శ మేమి? అనే ప్రశ్నకు మనం దాని రాజ్యాంగ విధానం చూచినా, దాని 'కాన్సన్ట్రేషన్ క్యాంపులు' చూచినా, దురాక్రమణలూ దారుణచర్యలూ విన్నా అపూర్వ ద్వేషాగ్ని కణాలే ప్రత్యుత్తరం. ఇంతవఱకూ చేసినదేమిటి. చేస్తామని అంటున్న దేమిటి తెలుసుకుంటే దాని సిద్ధాంతం స్పష్టమౌతుంది. విజ్ఞానాన్నీ సంస్కృతినీ యెలా చూస్తున్నారో తెలుసుకోవడం యీ విషయంలో మన కుపకరిస్తుంది.

మొట్టమొదట వారి విద్యావిధానాన్ని గమనిస్తాము. యీ విషయాన్ని గురించి అమెరికా విద్యాప్రవీణుడు డాక్టరు జీమర్ 'చావు చదువు' అని పుస్తకం రాశాడు. అందులో నాజీ స్కూళ్ళల్లో పదేండ్లలోపు పిల్లవాళ్ళకు కంఠాపాఠం నేర్పే ఒక పద్యాన్ని ఉదహరించినాడు: ఒక యీగ చిన్న యీగను పట్టుకొంది. చిన్నదెంత బతిమాలినా వదలదు. యీ క్రింది గీతలతో ఆ పద్యం ముగుస్తుంది:

"........................

'వదలుము దయచేసి నన్ను, అల్పుడ నాతోళ్'మని

వేడుకొన్నదా చిన్నది, 'కాదు కాదు వీలు కాదు

బలవంతుడ నేను; నీవు బలహీనుడవూ గనకా'

అన్నది ఆపెద్ద యీగ............."

ఆ పద్యం వరుసగా చెప్పింది కదా: ఈగను సాలీడు చంపుతుంది సాలీణ్ణి పిచ్చుక పొడుస్తుంది; పిచ్చుకను డేగ కొడుతుంది; డేగను నక్క మెక్కుతుంది; నక్కను కుక్క కొఱుకుతుంది; కుక్కను తోడేలు నంజుకుంటుంది; తోడేలును వేటకాడు హతమారుస్తాడు ప్రతిచోటా పట్టుకున్న దానితో పట్టువడిన జంతువు నానావిధాలా బంగ పోతుంది. పట్టుకున్న దామాట చెవిని పెట్టదు. ఎందు కంటే తాను బలవంతమైనదీ పెద్దదీ గనుక నంటుంది. ఈ పద్యంనుండీ తెలుసుకోవలసిన నీతిని ఉపాధ్యాయు డిలా వివరిస్తాడు:

"ఈ పోరాటం సహజం. అందుకనే మన నాయకుడు తన పిల్లవాళ్ళు బలవంతులు కావాలంటాడు. బలవంతులైతే పోరాడి విజయవంతులు కావచ్చు. లొంగిపోరు. ప్రకృతి లోనూ జీవితంలోనూ కూడా బలమూ దార్ఢ్యమూ కలవారే పూజింపబడతారు. జర్మనీ బలసంపన్న మవుతుంది. విశాల ప్రపంచంలో యెక్కడికైనా వెళ్ళి యే విరోధితోనైనా పోట్లాడే బలం కలదాన్నిగా మన నియంత చేస్తాడు."

ఇది నాజీతత్త్వ శాస్త్రానికి పునాది.

సామాన్యంగా ప్రతివాడూ యేకొంచెం సభ్యతవున్నా సమానత అవసర మంటాడు. సమానత మానవధర్మ మంటాడు. సమానత్వం కోసం చేతనైనంత పాటుబడతా నంటాడు. ప్రపంచంలోని సిద్ధాంతాలన్నీ సమానత నెట్లా సుసాధ్యం చేయవచ్చునో వివరించడానికే ప్రయత్నిస్తాయి ఆచరణలో నెట్లామారినా. కానీ ఫాసిజం తలక్రిందులు చేస్తుంది, సమానత్వం కాదు, అసమానత సమాజ సహజ మంటుంది. దాన్ని నిలపడ మవసర మంటుంది, "మన

ప్రభుత్వం సోవియట్ యూనియన్‌లాగా సర్వులకూ సమాన మైన హక్కులుండాలనే సిద్ధాంతంమీద పాలించడం లేదు'' అన్నాడు హిట్లరు (3—10—1941). కేవలమిది సోవియట్ యూనియనుకూ నాజీ జర్మనీకీ వున్న భేదాన్నే కాదు తెలియజేస్తున్నది. ఇదొక గొప్పగా నాజీ నియంత చెప్పుకో వడంలోనే ఉన్నది. అంటే అసమానంగా చూడడంకూడా తమ పాలనలో నుండే గుణంగా వారే చెప్పుకుంటున్నారు.

ప్రపంచంలో మూడు శతాబ్దులుగా స్పష్టరూపంతో యీ సర్వసమానత కోసం ప్రజాసంగ్రామాలెన్నో నడచినవి. ధీమంతులూ విజ్ఞులూ ప్రజానాయకులూ యెందఱో పోరాడినారు. యెందఱో ఆహుతైనారు. ఇన్నాళ్ళుగా సమానత నందని దేశాలన్నీ తీవ్రంగా ఆ సమానత కోసం సర్వస్వాన్ని ధారవోయడానికి సంసిద్ధములై పోరుతున్నవి. అట్టి సమానత ఫాసిజానికి గిట్టదు.

నాజీ వ్యవసాయమంత్రి వాల్తర్ డారే "రక్త – జాతి నూత్న కులీన వర్గం'' అనే ఒక పుస్తకమే రాసినాడు. అందులో అన్నాడు: "అసమానతమీదనే సమాజస్థితి అధార పడి వుంది. దాన్ని రూపుమాపడం సాధ్యంకాదు. అది జనన మరణములవలె మానవులనుండీ విడదీయరానిది; గణిత శాస్త్ర నియమాలవలె అసమానత మార్పరానిది; మన గ్రహ సంచారమును నడిపే ప్రకృతి నియమములవలె శాశ్వతమైనది'' ఇందులో వూరకే అసమానత అనుల్లంఘనీయమనే అయితే యింకొంచెం ముందుకు పోయినమాటలూ వినండి:

"అవిచ్ఛేద్యమూ ఫలవంతమూ అయిన మానవ అసమానతను ఫాసిజం అంగీకరిస్తుంది'' (ముస్సోలినీ: ఫాసిజం "విజ్ఞాన సర్వస్వం.'') ఇందువల్లనే అధినేత చేతిలో అన్ని

అధికారాలూ సర్వహక్కులూ ఉండాలంటుంది. అంటే ఫాసిస్టు హంతకుల యొక్క తదనుచర – అధికార వర్గం యొక్క అధీనంలో అంతా వుండవలెను. అందటినీ సమానంగా చూడడం సాధ్యం కాదు. ఇది పరమోన్నత ధర్మం కాదనే కాదు; కడకు మానవ సమాజమంత పరమోచ్చస్థితికి వస్తూన్న సమయంలో, సమానత స్వాతంత్ర్యం జన్మహక్కుని అంగీకరించే సమయంలో, యెంతనగ్న అసహ్య స్వరూపంతో సభ్యుల కేవగింపు కల్గిస్తుందో విశదమవుతున్నది.

తమ అధికారవర్గం జన్మతః ఉత్తమజాతి. అందుకని వారే ఏవిధమైన సంకోచం లేకుండా అందటినీ అణచిపెట్టి రాజ్యం చెయ్యాలి. జనసామాన్యం బుద్ధిహీనము. గొఱ్ఱెల మంద. ఇదీ మానవజాతికి వీరిచ్చిన బహుమతస్థానం. జనానికి ఆలోచనక్కరలేదు. ఆశక్తి వారికి లేదు. తెలివితేటలుండవు. "జనసామాన్య మేనాటికీ వ్యక్తిస్థానాన్నాక్రమించలేదు. వారు కేవలం బుద్ధిహీనులే కాక పిటికిపందలుకూడా. వంద మట్టిబుఱ్ఱలెట్లా ఒక బుద్ధిమంతుణ్ణి సృష్టించలేవో అట్లే నూరుమంది పిటికిపంద లొక ధైర్య నిర్ణయానికి రాలేరు." (హిట్లర్: డాక్టర్ సీజ్‌ఫ్రిడ్ మెట్జా 'అడల్ఫ హిట్లరు అల్స్ స్టేట్స్‌మాన్ అండ్ వొల్సార్ ఫ్యుయరర్' లో ఉటంకించబడినవి.)

"కార్మికవర్గానికి రొట్టే ఆటబూ తప్పా ఇంకేమీ అక్కఱలేదు. వారే ఆదర్శాలూ అర్థం చేసుకోలేరు."

(హిట్లర్ 'డీగ్రాస్ ట్రామెల్' లో ఉదాహృతం)

ఈ దృష్టిలోనే ప్రచార కార్యక్రమం నడుపుతారు. ఎంత అబద్ధమైనా చెప్పగా చెప్పగా జన మొప్పుకుంటారని వారి లెక్క. అబద్ధ మెంత పెద్దదైతే అంతబాగా నమ్ముతారంటాడు హిట్లరు. "జనసామాన్యం దేన్నైనా అవగాహన

చేసుకొనేశక్తి పరిమితం. వారి గ్రహణశక్తి అల్పం; వారి విస్మృతి అత్యధికం.''(మైన్ కాంఫ్ 198పుట) ఇంత పరమనీచంగా జనతా చైతన్యాన్ని చూచే సిద్ధాంత మెంత నీచమైందో చెప్పలేము. ''భావనలోనూ ఆచరణలోనూ జనసామాన్యం అడ.గలది. వారి ఆలోచనలనూ ఆచరణలనూ నడుపునది భావనా ఉద్రేకమూ; కానీ హేతువాదమూ దృఢసంకల్పమూ కావు'' (మైన్ కాంఫ్-హిట్లరు-200 పే.)

ఇంక ఇట్లాంటిజనం కాక కొంత ఆలోచించే మనుషులంటే ఫాసిస్టులకు బహుభీతి. వారి నణచడాని కట్టి అమానుష చర్యలైనా హింసలైనా చిత్రవధలైనా చేయడానికి జంకరు,

కాబట్టి మానవుల ఆలోచనా శక్తినీ భావనాశక్తినీ పెంపొందించే సంస్కృతీ విజ్ఞానమూ వీరికి గిట్టవు. విజ్ఞానం వుంటే మనమాట గొర్రెదాటుగా వినరు. గనక అవిజ్ఞానాన్నే మంటగలపాలి. సభ్యులను నేలమట్టం చెయ్యాలి ''విజ్ఞానమనేమాట వినేప్పటికల్లా నా రివాల్వరు తడువుకుంటాను.'' అన్న గోరింగుమాట సూత్రప్రాయంగా వారి విజ్ఞానవిరుద్ధతను గోచరింపజేస్తుంది.

ఫాసిజం మానవులలోని అపరిణత పశుభావాలను రేపుతుంది ఆలోచనాశక్తి నడుగంటించుతుంది. అందుకనే విద్యావిధానంలో దిక్కులేనంత మార్పును తీసుకవచ్చినది. పూర్వం జర్మనీ విద్యావిధానం అత్యున్నతస్థితిలో వుండినది. విజ్ఞానంలో తత్త్వశాస్త్రంలో వారికొక విశిష్టస్థాన ముండినది. ఆ విజ్ఞానపు పునాదులమీదనే నేటి సైన్య యుద్ధయంత్రాన్నంత పటిష్ఠంగా నాజీలు నిర్మింపగలిగినారు. కానీ యిది మహాపదప్రమని తెలుసుకొని వుూచమట్టంగా ఆపద్ధతులను తొలగించివేసినారు.

1933 లో జర్మనీలో విశ్వవిద్యాలయాల్లో పెద్దకళా శాలల్లో చదువుతూన్న వారిసంఖ్య 150000 నుండీ 1939 కల్లా 60000 కు తగ్గిపోయింది. (డాక్టర్ మెంట్జల్ – రీజ్ విద్యామంత్రి వర్గంలోనివాడు – రిపోర్టు 1941) ఇంకో పక్క సోవియట్ యూనియన్‌లో 1930 లో 295000 నుండీ అదే సమయంలోనే 700000 కు పెరిగి పోయింది. ఎంత తారతమ్యమో!

సిద్ధహస్తులైన వైజ్ఞానికు లెందఱినో తమ చెప్పుచేతుల్లో మెలగరనే కారణంతో పనులనుండీ తొలగించి వేసినారు. కొందరు యూదులని. యూదజాతిని నాజీలు చూచేంత నీచంగా ఘోరంగా ప్రపంచంలో యింకెవ్వరూ యేజాతినీ చూడలేదు; చూడలేరు. స్వతంత్ర పరిశోధన సాధ్యమే కావడం లేదక్కడ అందుకనే జర్మనీనుండీ మహామహు లెందఱో ఇతర దేశాలకు ప్రవాసితులు కావలసి వచ్చినది. ఇందులో ప్రపంచ ప్రసిద్ధు లెందఱో వున్నారు. థామస్ మాన్, ఐన్‌స్టైన్, సిగ్మండ్ ఫ్రాయిడ్, ఎర్నెస్ట్‌టోలర్, హైన్‌మాన్, ఫిచ్ వాంగరు, స్టీఫన్ జివిగ్, రిమార్క్. అక్రమిత భూభాగంలో వుండిన ప్రపంచ ప్రసిద్ధ రచయిత రోమా రోలాంను నిర్బంధితుణ్ని చేసినారు. 1938 అఖరు వఱకూ యిట్లా జర్మనీ అస్ట్రియాలనుండీ ప్రవాసితు లైనవారి సంఖ్య 1838. ఇందులో జర్మనీలో నోబుల్ బహుమానాన్ని పొందినవారిలో నాలుగోవంతుకూడా కలిసి వున్నారు.

మిగిలిన విద్యార్థులకుకూడా పూర్వమున్న విషయాల కొన్ని టినో తొలగించివేసి బోధిస్తున్నారు. వివిధ శాఖల్లోని విద్యార్థుల సంఖ్యను 1932 తో పోలిస్తే 1937 లో 57. 8.

తగ్గినది, అందులోనూ ముఖ్యంగా గణితం, ప్రకృతిశాస్త్రం వీనిలో 35. 6 తగ్గింది. అంటే మూడోవంతు. ప్రధాన శాస్త్రాల్లో విద్యార్థుల సంఖ్య తగ్గిపోయింది. ఇంక పెరిగిన విషయాలేవంటే: 'జర్నలిజం – పత్రికా విలేఖనం – లో 169% 'బోధన' 142% వంతున ఇవి రెండూ నాజీ ప్రచారానికి ముఖ్యోపకరణాలు. అందుకనే యీ రెండు విషయాల్లో బాగా జాత్యహంభావాన్ని నూరిపోసి వారిద్వారా జన సామాన్యానికి మత్తుమందు కలిపివ్వడమే వీరి ప్రధానాశయం. (ఇ. వై. హార్ట్‌నెట్ షార్న్. "జర్మన్ విద్యాలయాలూ నేషనల్ సోషలిజమూ" హార్వర్డు విద్యాలయ ప్రచురణం 1937).

సైనిక శిక్షణ, ధీశక్తిమీద అసహ్యం, జాతి ద్వేషం, ఇతర జాతుల నణచివెయ్యాలనే దురుద్దేశ్యం, యుద్ధాన్నీ హింసనూ మానవాదర్శాలుగా వర్ణించడం, విధేయత, కండలు పెంచుకోవడం, ఇవీ వారు అహోరాత్రిస్సా నేర్పుతున్నది. శిక్షణయిట్లా వుండాలనేదే నాజీ సిద్ధాంతం. "బుద్ధికౌశల్యం అప్రధాన విషయం"–హిట్లరు.

"విద్యాశాల లంటే సైన్యానికి సన్నద్ధం చేయడం".

నాజీ విద్యామంత్రి రుస్టుగారు

"జాతి భారవహుడైన యువకుడు తర్వాతి జీవితంలో ఆయుధ భారవహుడైనప్పుడు ఉపయోగించే సంగతులను బడి చదువుగా సంతరించవచ్చును" ('డెహ్రర్ జీటంగ్' విద్యా పత్రిక. 'ఆయుధ విద్య' నవంబరు 1935.)

సత్యాన్వేషణే ప్రధానంగా పనికివచ్చే వైజ్ఞానిక పరిశోధననే — Absolute sciences యెత్తివేసినారు. "సత్యాన్ని చేరుకొనేందుకై చేసే అనవరత పరిశ్రమే అద

ర్శంగాగల విజ్ఞాన భావానికన్నా యీ నూతన విజ్ఞానం చాలా భిన్నమైనది.” (బి. రుస్టు. నాజీ విద్యామంత్రి. హీడిల్ బర్గు. విశ్వవిద్యాలయ వార్షిక దినోపన్యాసం-1936.)

“అంతర్జాతీయ విజ్ఞానాన్ని మేము లెక్కించము. వైజ్ఞానికాంతర్జాతీయ పరిషత్తును మేము ధిక్కరిస్తాము. పరిశోధన కర్యే చేసే పరిశ్రమను తిరస్కరిస్తాము. మనం చరిత్రను బోధించేదీ తెలుసుకొనేదీ వాస్తవ సంఘటనలను విశదీకరించడానికాదు. మరి యితర దేశీయుల పోటీలో జర్మన్ ప్రజల సాధనాలను నిశితం చేయడానికి”

డాక్టర్ కాస్టెడ్. గోటంజన్ యూనివర్శిటి చరిత్రాచార్యుడు. జర్మన్ సామ్రాజ్య దినోపన్యాసం.

(ప్రకృతి – నేచర్ 24-4-37.)

ఇదే పరమాదర్శంతోనే విజ్ఞానాన్ని మంట గలిపినారు. యుద్ధ పరికరాలకు పనికివచ్చేవి తప్పా విశ్వమానవ శ్రేయస్సు కుపయోగించే శాఖలనే కట్టిపెట్టినారు. అంటే ఫాసిజం విజ్ఞానాభ్యుదయానికి విరోధి అన్నమాట. ఇంతతో విడువక విజ్ఞానాన్ని మరీ నికృష్ట విషయాలకు ఉపయోగించాలనుకున్నారు:

“విజ్ఞానం, జాతీయాహంభావాన్ని పెంపొందించే సాధనంగా జాతి ప్రధాన ప్రభుత్వం పరిగణించాలి.”

(హిట్లర్ మైన్ కాంఫ్ 473 పేజీ.)

జర్మన్ జాతి ఆర్యజాతి ప్రపంచంలో ఆ జాతికి మించిన జాతిలేదు. అన్ని జాతులనూ పరిపాలించే హక్కు తమకు దైవ నిర్ణీతం. ఈ జాతీయాహంకారం చంటిపాలతో పిల్లలకు నూరి పోస్తున్నారు ఈ ధోరణితోనే పెద్ద సిద్ధాంతమొకటి బయలు దేరదీసినారు. ‘ఆర్యజాతి ఆర్య రక్తం.’

ఒకప్పుడు హిట్లరీదృష్టిలోనే భారత ప్రజలు అసార్యులు గనుక 'స్వయం పరిపాలన కనర్హులని' వ్రాగాడు. దాని కప్పుడే నారిమన్ ఘాటుగా బదులిచ్చినాడు.

ఆర్యరక్తం పవిత్రం. అది లేనివాడు అధమ. దీన్ని గూర్చి యెంత బ్రహ్మాండం చేసిశారని.

"నేడొక కొత్త మతం జాగృత మౌతున్నది. రక్తమతం: దైవ విభూతిని మానవుడు రక్తం ద్వారానే రక్షిస్తాడనే మతం. పరిశుద్ధ విజ్ఞాన పూరితమైన నార్డిక్ జాతి రక్తం ప్రాచీన తపఃప్రతిష్ఠాపితమైన దైవశక్తికి ప్రాతినిధ్యం వహిస్తుందనే మతం."

(ఆల్‌ఫ్రెడ్ రోసన్‌బర్గ్ 'ఇరవయ్యో శతాబ్ది మతం. మూనిక్ 1935. 114 పేజీ.)

"ప్రధాన జీవశక్తులైన రక్తమూ దేహమూ, జాతీయ రాజ్యాంగ దృక్పథానికీ వికసిత ప్రపూర్ణ జీవితానికీ చిహ్నాలు. వాటితోనే నూతన విద్యావిధానానికి పునాది సిద్ధపడుప బడుతుంది. రక్తమంటే యేమిటో శరీర శాస్త్రం రసాయనశాస్త్రం, వైద్యశాస్త్రం బోధించే దానితో తృప్తిపడి వూరుకుండలేము. జాత్యుషః ప్రారంభం నుంచీ, ఈ రక్తం — యీ జీవిత ప్రవాహచ్ఛాయ విశిష్టతా స్ఫోరకమై మనలను భావ ప్రపంచంలోకి గొంపోయినది. రక్తం శరీర నిర్మాత: జాతి శక్తికి ఊటబుగ్గ. రక్తంలో మన జాతీయ సంప్రదాయం మిణుకుమిణుకు మంటున్నది. రక్తంలో జాతి సుసిక్షితమైంది. రక్తంనుంచే మానవశీలమూ సౌభాగ్యమూ ప్రభవిస్తుంది. రక్తం మానవునికి అంతర్గర్భిత విద్యుచ్ఛక్తి; జీవిత వాహినీ చిహ్నం."

(ఫ్రాంక్‌ఫర్‌ట్ యూనివర్సిటీ రెక్టారుఉపన్యాసం, క్రీ 1935)

ఈ జాతి సిద్ధాంతం ఫాసిజం కొత్తగా కనిపెట్టిందికూడా కాదు. అన్ని సామ్రాజ్య వాదాల్లోనూ ఉన్నదే. దీన్ని సిద్ధాంతంగా ప్రారంభించిన వాడు కౌంట్ డి గోబినో. అనే ఫ్రెంచి రాయలిస్టు. అప్పుడు రాజకుటుంబాల కులీన సంసారాల భూస్వాముల ఔత్కృష్ట్యం ధిక్కరిస్తూ వస్తూన్న ధనికవర్గాన్ని చూచి అణచి వెయ్యాలనే ఉద్దేశంతో అతనొక పుస్తకం వ్రాసినాడు. దానిపేరు 'మానవజాతుల అసమానత' (1853) మానవజాతులన్నీ బుద్ధిలో శక్తి సామర్థ్యాల్లో సమానం కావట. సర్వసమత్వం అర్థంలేనిదీ సారాంశం. దీన్నే కడకు బూర్జువా వర్గీయులూ సామ్రాజ్య వాదులూ సాధనంగా ఉపయోగించుకుంటున్నారు. ఫాసిజం మరీ తీవ్రతరం చేసింది.

ఈ సిద్ధాంతం అనర్థదాయకమూ అశాస్త్రీయమూ అని విజ్ఞానులెందఱో సకారణంగా నిరూపించినారు.

"విజ్ఞానానికి పరమ విరోధుల్లో ఒకటి విపరీత జ్ఞానం.... ఈఅధ్వాన్నమైన పరిస్థితి జాతి విషయంలో మరీ బాగా కనిపిస్తుంది. 'జాతిజీవశాస్త్రం' అనే విపరీత విజ్ఞానమొకటి పైకి లేచింది. రాజకీయ వాంఛలనూ, ఆర్థిక ఆశలనూ వర్గద్వేషాలనూ ఔననిపించడానికి దీన్నుపయోగించు కుంటున్నారు......

జాతి సిద్ధాంతమొక కట్టుకథ. అనర్థకమైనది. స్వార్థపూరిత ఆర్థిక దురాశకిదో ముసుగు. దానిని తొలగించి నగ్నంగాచూస్తే అది చాలా అసహ్యంగా కనిపిస్తుంది. అంతేగాక యిది సశాస్త్రీయం కాదు" (జూలియన్ హక్స్లీ ఎ. సి. హాడన్. "మనం యూరపియన్లం: జాతి సమస్యల పరామర్శ— 1935.)

ఈ సిద్ధాంతం చెబితేగానీ పరాయిదేశాల దోపిడీకి జనాన్ని ఉసికొల్పడం కష్టమని యీయెత్తు వెతికినారు. సమాజంలో రెండు వర్గా లుండడం సహజం. అట్లాగే దేశాల్లోనూ రెండు వర్గాలు. ఒక జాతే పాలనాధురీణ మైనది. అది జర్మన్ జాతే. పరస్పర విరుద్ధ సిద్ధాంత మిది.

జర్మన్ జాతికే చెందిన కార్మికుడు మరీ గొప్పవాడు కాదు.

"జర్మన్ కార్మికుడు అలంబనంగా ఉపయోగపడతాడు. అతని భక్తి విశ్వాసాలు యోచనకు తావివ్వవు. స్వాభిప్రాయాన్ని ప్రకటించలేవు. అతణ్ణి అంధ విశ్వాసానికీ విధేయతకూ అభిషిక్తుణ్ణి చేస్తాయి" (హిట్లరు రెండో కార్మిక మహాసభ) "ధనిక పద్ధతేమున్నది? తమ శక్తి సామర్థ్యాల మూలంగా ఉత్తమస్థితి నందుకున్నారు. యీ విశిష్ట గుణంతో వారుత్తమ వర్గీయులనీ, వారికి నాయకత్వం వహించే హక్కున్నదనీ స్పష్టమవుతుంది" హిట్లర్. కానీ వెంటనే యితర దేశాలమీదికి వీరు పోవలసి వచ్చినప్పుడు:

'నార్డిక్కు జాతికి ప్రపంచాన్ని పాలించే హక్కున్నది. మన యీహక్కును విదేశాంగ విధానంలో మార్గదర్శకం చేసుకోవాలి' (హిట్లరు-ఓట్టోస్ట్రాసరుకు 21-5-1930)

"ఎవరైనా వాస్తవంగా నిష్కల్మషంగా శాంతివాదాన్ని స్థాపించాలనుకుంటే జర్మనులు ప్రపంచాన్ని జయించిం తర్వాత యిష్టం వచ్చినట్లు చేసుకోవచ్చు......శాంతివాదుల జీవకారుణ్య దృక్పథం అత్యుత్తమవర్గ స్థితికి చెందిన మహాత్ముడు జయించి లొంగతీసుకున్న తర్వాత చాలా మంచిదే కావచ్చును. అట్లే ఆయన భూమికంతటికీ ఏకచ్ఛత్రాధిపతి కాగలడు," (హిట్లరు, మైన్ కాంఫ్ 315 పేజి)

"తెల్లజాతి పాలించడానికే నిర్దిష్టమైంది. దానికి పాలించాలనే అంతర్వాంఛ ఉన్నది. ఈ వాంఛ ధనంపైని వీరతా దృష్టితో ఉద్భూతమైంది. అది పూర్తిగా శాంతి వాద భిన్నం. శ్వేతజాతి ప్రపంచ పరిపాలన పునాదులను వదిలిపెడితే ఆ పాలనాశక్తి పోతుంది. యీ పాలనే యూరోపు కట్టుబాట్లకు మూలం" (హిట్లరు మ్యూనిచ్‌లో ఉపన్యాసం 26-1-36.)

ప్రపంచంలో తెల్లజాతి పెద్దది. అందులో జర్మన్ జాతి ఉన్నతమైనది. ఫ్రెంచివాళ్ళు 'అధమ వర్గీయులు' ఫ్రెంచి సామ్రాజ్యమంతా 'దాసీపుత్రులైన అధమ జాతివారి'తో నిండివుంది. జెక్కులూ పోలులూ చవటలు, రష్యాకు కమ్యూనిష్టు దయ్యం పట్టింది. బ్రిటన్ యూదులతో సంపర్కం వుంది. అమెరికా 'నానా జాతులకూ' ఆలవాలం. ఇప్పటివరకూ జపానువాళ్ళు 'అనరరీ ఆర్యనులు' ఆ జర్మనుల లోనూ ధనికవర్గం ఉన్నతమైనది. ఆ వర్గంలోనూ నాజీ పార్టీ అందుకధినేత హిట్లరు. ఈయన ప్రపంచాధినేత కావడాని కర్హుడు.

ఎంత దురహంకారం!

అందుకనే తమకు పనికిరాని వారికి బిడ్డలు పుట్టకుండా చేస్తున్నారు. చేతనైనంత మందిని బానిసలు చేసుకోవడం, వీలులేనివారిని విధ్వంసం చెయ్యడం, కొందటిని గొడ్డులను చెయ్యడం. యీ విషయాన్ని గూర్చి అమెరికా రచయిత గ్రోకర్ జీమక్ అనే ఆయన తానుచూచిన సంగతి నిట్లా వర్ణించినాడు.

"నేను చూడగనే ముఖంలో నెత్తురుచుక్క లేకుండా పోయింది. సరే. ఒకదాని వెనుక నొక ఆసుపత్రి మంచము

వచ్చింది; పోయింది. డాక్టర్లు గబగబా తెల్లటి పాత్రికడు పులమీదవాలి గుడ్డపటిచి ఆయుధాల నుపయోగించినారు. లోపలికి జొనిపి కప్పి కత్తరించిన ట్యూబును సున్నితంగా పైకెత్తినారు. గాయాన్ని కుట్టివేసినారు. ఆ శరీరాన్ని తోసుకొనిపోగా యింకొక టూ తావు నాక్రమించింది.

ఏమిటి వాళ్లు చేస్తున్నద నడిగాను ఆయన నా నాజీగైడు చెప్పాడు: 'జర్మనీకి అసాధారణ వీరులు కావాలంటే ప్రభుత్వం యేం చెయ్యాలో అవనే చేస్తున్నారు. ఈ డాక్టర్లు ఆడవాళ్ళను కనకుండా చేస్తున్నారు' అన్నా డతను.

ఇట్లానిర్బంధించే దేవిధమైన వారి నని అడిగాను. కొందఱు బుద్ధి చాంచల్యం కలవారు, కొందఱు శక్తిహీనులు, కొందఱు ఇంటిగౌనాన్ని బట్టి అశక్తులను ప్రసవించేవారూ నని బదులిచ్చినాడు. కొందఱు కొన్నిలోపా లున్నవారున్నారు.

ఇంకా ప్రశ్నింపగా కొందఱాడవాళ్లు ప్రభుత్వానికి విరోధులు గనుక గొడ్డుగా చేస్తున్నామన్నాడు. అందులో చాలామంది జైళ్లలో వుండవలసింది. ఆడవాళ్ళను జైళ్ళలోపెట్టడం అమానుషం. యిట్లా చేస్తే వారికి రాజకీయాల్లో అపేక్ష వుండదు, ముఖ్యంగా సరిఆడవాళ్ళీ మొగొడ్డుబోతని తెలుసుకొన్నప్పుడు. యితరుల కాసంగతి తెలిసేట్టు మేం చేస్తాము అన్నా డతను.

యేటా యెందఱిని గొడ్డుబోతులను చేస్తారో చెప్పలేక పోయినా డతను; కానీ యీఆసుపత్రిలో అరుగురు డాక్టర్లు వారానికి నాలుగురోజులు శస్త్రచికిత్స చేస్తారనీ అత డెరుగును. ఈపద్ధతి జర్మనీలో పెద్దపట్టణా లన్నిటిలోనూ 1933 నుంచీజరుగుతూవుంది."

(గ్రోగర్ టీమర్ "చావుచదువు" న్యూయార్కు—1941)

ఇంతకన్నా ఘోరా లున్నవి. రాజ్యానికి బరువని జబ్బు పడినవారినీ ముదుసలివారినీ చంపడమవసరమని నాజీవాఙ్మయ ముద్బోధిస్తుంది. 'డీమారల్ డెర్ క్రాఫ్ట్' — బలంలోని ధర్మాలు — అనే పుస్తకాన్ని నాజీనాయకుడు ఎర్నెస్ట్‌మాన్ రీమర్ లో ప్రకటించినాడు. అందులో ఆయన వాదమిది: చాలారోజులనుంచీ మూలబడినవారూ యుద్ధంలో పనికిరాకుండాపోయినవారూ ఆత్మహత్య చేసుకోవడం ధర్మమూ విధీ. ప్రభుత్వం దుర్బలులనూ రోగులనూ నిర్మూలించడానికి పూనుకోవలెను.

ఈ ధర్మానుగుణ్యంగా యుద్ధారంభంనుంచీ వేనకువేలు ఖూనీచేయబడుతున్నారు. సంఖ్య సరిగా తెలుసుకోవడం కష్టం. నూరువేలమందివఱకూ వుండవచ్చునని అమెరికా విలేఖరు లన్నారు. ఎన్నో సంఖ్య తెలీదు కానీ "అసంఖ్యాకులు జర్మనీ శానటోరియములనుంచీ కొనితేబడి చంపబడుతున్నారనే విషయంలో ఏమాత్రం సందేహం లేదు."

(జోసఫ్ హార్ష్ — దండయాత్రా పద్ధతి. హాన్‌మార్ 1943
228 పేజీ)

ఇంక స్త్రీలవిషయంలో నాజీ అత్యాచారాల కంతులేదు. ఆధునిక ప్రపంచంలో స్త్రీస్థానం ఉత్తమతరగతికి చెందినది. వాళ్ళు ప్రతి ప్రజారాజ్యంలోనూ కొంతో గొప్ప స్వతంత్రులై మానవాభ్యుదయ నిర్మాణంలో భాగరులౌతున్నారు. సోవియట్ యూనియన్ సుదతు లీనాడు మగవారి కన్నా తీసిపోక పనిచేస్తున్నారు. కానీ నాజీల దృష్టిలో ఆడవాళ్ళు కేవలం వంటింటికీ పడకటింటికీ పనికివచ్చే యంత్రాలు. కొన్ని వేలమందిని ఉద్యోగాల నుంచీ తొలగించివేసినారు. ఇప్పుడు మానవ నాశనానికి పనికివచ్చే 'యుద్ధపరిశ్రమల్లో

మరీ కొందరిని చేర్చుకొంటున్నారు. సమాజంలో వారి కిస్తున్నది నీచస్థానం. వారి కర్తవ్యాలు రెండు: సోల్జర్లకు సోల్జర్లను కనడం; ఇంటి పనులు చూసుకోవడం. చదువూ సామూ, సంస్కృతీ విజ్ఞానమూ, రాజకీయాలూ వారు చొరరాని కీకారణ్యాలు.

"స్త్రీ విద్యా విషయంలో ముఖ్యమైనది శరీర శిక్షణ. తర్వాత శీల శిక్షణ. అన్నిటికన్నా ఆఖరుది మేధ శిక్షణ. కానీ స్త్రీ విద్యలో పరమాదర్శ మేమంటే భావిమాతృస్థానానికి సరిపడేదిగావుండవలెను."

(హిట్లరు మైన్ కాంఫ్ 459-60 పుటలు)

"నేషనల్ సోషలిస్టు ఉద్యమం పురుష సంబంధమైంది... జీవితానికి రేఖాచిత్రిణం సరణీ నిర్మాణం పురుషుడు చెయ్యాలి. స్త్రీ అంతఃపరిపూర్ణతవల్లా అంతర్వాంఛవల్లా యీ రేఖాసరణులను సరాగం - వర్ణరంజితం - చెయ్యాలి. నాయకత్వం నిర్ణాయకత్వం బాహ్యజీవితంలో సామాన్యంగా కనిపిస్తాయి. అవి, అద్భుత మహోద్యమమైన రాజకీయాలకు చెందినవి. ఈవిషయం, యేపరిమితీలేకుండా మగవారికి చెందినది. బాహ్య జీవితంలో నుంచీ మనం ఆడవళ్ళను నిషేధిస్తున్నామంటే వారితో పనిలేదని కాదు. మరి వారికి ముఖ్య గౌరవాన్నివ్వడానికే... స్త్రీల ప్రధాన మహత్కర్తవ్యం భార్యగా మాతగా పనిచెయ్యడమే ... స్త్రీ కుటుంబములో పిల్లలలో పరమానందాన్ని చెందుతుంది."

(గోబెల్సు 11 2 1934)

(డెర్ నేషనల్ సోషలిస్టి షీస్టాట్ లో ఉదాహృతము)

"తల్లి తన కుటుంబానికీ పిల్లలకూ జీవితాన్ని పూర్తిగా అర్పించవలెను. 'భార్య మగనికి జీవితాన్నర్పించవలెను.

కన్యక స్త్రీకి తగిన వృత్తుల మీద నే ఆధారపడవలెను. మిగతా ఉద్యోగాలన్నీ మగవానికే యివ్వబడుతాయి.''

(డాక్టరు ఫ్రీక్.)

'జర్మన్ స్త్రీలకు నేనేం చేశానంటారా? ప్రపంచంలో ఉత్తమ సంతానపితలను — నా సైనికులను-మీకు వప్పగించాను. ఇదే నేను జర్మన్ స్త్రీలకు చేసింది. ఇదే నా సమాధానం'' (హిట్లరు, నూరెంబర్గు నాజీపార్టీ కాంగ్రెసులో ఆడవాళ్ళకు ఉపన్యాసం 1936 సెప్టంబరు.)

నాజీలకు కావలసింది యుద్ధానికి బలి పశువులు. అందు కనే యీ ఉపన్యాసాలూ సిద్ధాంతాలూ ధర్మనిర్వచనాలూ: 'కనండి' అన్న స్త్రీల నినాదంలో పెండ్లి ప్రేమా కూడా పరిగణింపబడలేదు. ఇంత పాశవంగా నగ్నంగా బహిరంగం గా యిట్టి ధర్మ ప్రవచనా లింకెవ్వరూ చెయ్యలేరు. చెయ్య బోరు చెయ్యరు

''నేడు జర్మన్ కన్యలమీదొక సైనిక బాధ్యత వుంది. వివాహ సంబంధ సమస్య యిప్పుడులేదు. ఇక్కడా సంగతే రాదు. మీవిధి యుద్ధముఖానికి వెళ్ళే సైనికుల పిల్లలకు తల్లులు కావడమే'' (హిట్లరు.)

ఇట్టివి వుదహరించవలసి వస్తే వేలపేజీలు కావలసివస్తుంది? సారాంశం మన కింతతోనే తెలిసి పోయినది కదా! ''భౌతిక వాదులు చెప్పే సౌఖ్యం సాధ్యం కాదంటుంది ఫాసిజం'' అన్నా డెప్పుడో ముస్సోలినీ. పైగా వీరికొక్క నిర్దిష్ట కార్యక్రమం లేదు: ''మనకు కావలసింది కార్యక్రమంకాదు; కార్యం'' (ముస్సోలినీ) ''మొదట రాజ్యం చేయడంమొదలు పెడదాము. తర్వాత కార్యక్రమం దానంతటదే తయారవు తుంది.'' (హిట్లరు 1923). 'జనం కార్యక్రమం కోరడం

లేదు; వారిని పాలించడానికొకడు కావాలి' (హిట్లరు 1923) 'నేనే పార్టీని స్థాపించివుంటే ఏ కార్యక్రమాన్నీ యిచ్చివుండే వాణ్ణే కాదు......మాకు కార్యక్రమం లేదనో కాక ఉన్నది పరస్పర విరుద్ధంగా వున్నదనో విందిస్తుంటారు. కానీ అందువల్లనే మేము విజయాన్ని సాధిస్తాము.' (గొబెల్సు)

ఇదీ ఫాసిస్టు తత్త్వశాస్త్రం. ఇదీ ఫాసిస్టు ధర్మశాస్త్రం. నీతి సభ్యత లిందువల్లనే మనం నగ్నస్వరూపంలో చూడవచ్చు.

ఇంకా మనం ఫాసిస్టు సిద్ధాంతాలను అసహ్యించుకోకుండా ఉండగలమా! చాలింక. వారి కార్యాలనూ కొన్ని చూదాం — అప్పటికి కానీ మనకొక స్వరూపం పూర్తిగా కన్పించదు.

---

# ఫాసిజం: కార్యక్రమం

---

అదింతవఱకూ చేస్తున్నదీ చేసినదీ తెలుసుకుంటే మన ఫాసిజం పర్యవలోకనం పూర్తి అవుతుంది.

దురాక్రమణనూ దోపిడీనీ కప్పిపెట్టడానికేదో 'న్యూ ఆర్డరు' అంటూంటారు. యూరోపు న్యూ ఆర్డరంటాడు హిట్లరు. రోమక సామ్రాజ్య పునరుద్ధరణ మనుకుంటాడు ముసులోనీ. కొత్త ఆశియా నూతన పద్ధతంటాడు టోజో (జపాను) యెట్లా దీన్ని స్థాపించారు? స్థాపిస్తారు?

నాలుగేండ్లుగా హిట్లరు ముసులోనీ మొతా యూరోపు పల్లెలనూ పట్టణాలనూ కాల్చి నేలమట్టం చేశారు. దోపిడీ చేశారు. అక్కడి ప్రజల స్వతంత్రాన్ని కొల్లగొట్టి బానిస లనుచేసి వెట్టి చాకిరీ చేయించు కుంటున్నారు, అక్రమిత రాజ్యాల్లో భీభత్సం పుట్టించింది ఫాసిజం జపాను నంతకు మూడేండ్లముందుగనే తూర్పున బలహీన దేశాలపైబడి నురు మాడు తున్నది. నాశనం చేస్తున్నది. వీరి కార్యక్రమమంతా దురాక్రమణ అనే పునకు స్పష్టమౌ తున్నది.

ఈ దారుణ కార్యక్రమానికి ముసులోని యెనిమిదేండ్ల ముందే అబిసీనియాలో అంకురార్పణ చేసినాడు. అనాగరి కతను పోగొట్టి సభ్యతను పెంపొందించే మహాసంకల్పంతో అమానుషమైన పాశవ హింసాదేవిని తాండవింప జేసినారు పాపం! పాత అబిసీనియాలో. వాళ్ళ కే నూతన ఆయుధసం పత్తీలేదు బందూకాలు పట్టుకొని మాతృదేశ భక్తితో రంగ మున దూకిన యోధులనూ యేమీ యెఱుగని ప్రజలనూవిమా నంనుండీ బాంబులను కురిపించి చంపినారు. అప్పుడు కియానో అన్నాడట : విమానం మీదినుండీ బాంబులు పడుతున్నప్పుడు చెల్లాచెదఱుగా పరుగులెత్తుతూ విఱుమకొని పోతున్న ప్రజ లను చూస్తూంటే కనుల పండువుగా వుంటుందని. యే కిరా తకుడైనా యిట్లుంటాడా అనిపిస్తుంది. స్పెయినులో ఫ్రాం కోను లేవనెత్తి సంపూర్ణంగా సహాయంచేసి ప్రజాసమ్మతితో యేర్పడిన ప్రభుత్వంపై విద్రోహం చేయించి ధూళీ దూసరి తం చేసినారు. మహా దారుణ యుద్ధం జరిగింది. స్వతంత్ర ప్రియు లెందఱో విదేశాలనుండీవచ్చి ప్రజా ప్రభుత్వంపై పు స్వచ్ఛంధ సేవ చేసినారు. యెందఱో మడిసినారు — రాల్ఫ్ ఫాక్సు వగైరా.

ప్రజాప్రభుత్వాలు పాతసంధులను. 'సంయుక్త బాధ్యతనూ' వదిలివేసి 'తటస్థ విధానా న్నవలంబించినవి. . సోవియట్ యూనియన్ 'సంయుక్త బాధ్యత'ను గూర్చి నొక్కి చెప్పినది. ఎవ్వరూ ఒప్పుకొనలేదు. కడ కక్కడ ఫ్రాంకో – ఫాసిస్టు – ప్రభుత్వం నెలకొనింది. ఆస్ట్రియా జెకోస్లొవేకియా లట్లే ప్రజారాజ్య – ఔదాసీన్యంవల్లా వంచనవల్లా మంటగలిసినవి,

పోలెండు హాలెండు లక్సంబర్గు బెల్జియముల నాపై ఆక్రమించుకొన్నారు. నార్వేను నలిచివేసినారు. ఫ్రాన్సుపై దాడి జరిపినారు. ప్రభుత్వం పంచమాంగ దళ ప్రచారా న్నాపలేకపోయింది. దేశీయ ప్రజను సమీకరించి ఆయుధాల నివ్వకపోయింది. కమ్యూనిజం భయమే కానీ ఫాసిజం ప్రమాదాన్ని గమనించలేక పోయింది. ఫ్రాన్సు పతనమైంది. ఇంగ్లండులోని వివిధ పరిశ్రములనూ పట్టణాలనూ అందలి ప్రజోపయుక్త భవనాలను ప్రజానీకాన్నీ బాంబులకు గురిచేసినారు.

కడకు సోవియట్ యూనియన్ పైన్నే దాడిజరిపినారు.

జపాను తూర్పునుండీ లేచింది. మంచూరియాను పొట్టబెట్టుకొనింది. కొరియాను కాల్చివేసింది. చీనాను కబళింప నారంభించింది. కానీ చీనా మింగరాని కడయింది. ప్రపంచ ప్రాచీన నాగరికతకు నిధానమైన చీనాలో వీరు చేసిన దుండగాల కంతులేదు. అయినా ఏకైక వీరప్రాయంగా చైనా ప్రజాశక్తి ఢీకొన్నది. యింకా పోరాడుతూనే ఉన్నది. సుమత్రా జావా పెరల్ హార్బరులను లాగుకొన్నారు. మలయా మాడిపోయినది. సింగపూరు చిక్కిపోయినది. బర్మాను బానిస చేసుకొన్నారు. కడకు

మన మాతృభూమిలోని తూర్పు బెంగాలులో చిటగాంగుపై బాంబులు కురిపించినారు. ఆంధ్ర ప్రాంతంలోని విశాఖ పట్టణం కాకినాడలపైకూడా బాంబులు వదలినారు. వారం క్రింద నే మదరాసుకూడా దాడికి గురియైనది

యీ దురాక్రమణ కార్యక్రమంలో వాస్తవంగా జరిగినదేమి? అక్కడ వీరు చేసినదేమి? అక్కడ వీ రేర్పఱచిన నూతన పాలనా విధానమేది?

ఎప్పుడూ సైన్యాన్ని తయారు చెయ్యడమే విధిగా పెట్టుకొన్నారు. ఫాసిస్టు సైన్యాలు ప్రజాసైన్యాలు కావు. తమదేశ స్వాతంత్ర్యాన్ని రక్షించుకొనేందుకు పోరాడకుండా పరదేశాలను వలసలుగా మార్చేందుకై అవి పని చేస్తున్నవి. అందుకనే ఆ సైన్యాలను దొంగల గుంపులుగా తయారు చేస్తున్నారు.

ఫాసిస్టుసైన్యా లాక్రమించిన తావుల్లో అక్కడి అమూల్య వస్తువులన్నిటినీ కొల్లగొట్టి పైగా యింటికి పంపుతున్నారు. మొన్న సోవియట్ యూనియనులో చచ్చిపడిన సైనికుల దగ్గఱ కొన్ని జాబులు దొరికినవి అవి వారి వారి యింటివద్దనుంచీ వచ్చిన జాబులు. వాటిలో తమకు కావలసిన గుడ్డలూ తిండీ వెలగల వస్తువు లేవేవో పంపమని వ్రాసినారు. అవి అధికారులకు దొరికినవి జర్మన్ పై అధికారులు కూడా వీనిని ప్రోత్సహిస్తున్నారు. 68 వ జర్మన్ పదాతి దళాన్ని విధ్వంసం చేసినప్పుడు రెడార్మీకి ఒక రహస్య ఫర్మానా 17–7–41వ తేదీ గలది దొరికినది. ఇది జర్మన్ ఆర్మీ అన్ని ప్రచారకేంద్రాలకూ ఉద్దేశింపబడింది.

"జర్మన్ సేనలోని ప్రతి ఆఫీసరుకూ ప్రతిసోల్జరుకూ స్వంతలాభం కలుగుతుందని యుద్ధాసక్తి వేలులు పారింది."

ఆర్డరు 24220,14 రుమేనియన్ డివిషన్-చీఫ్,—నికోలేస్కో వ్రాసిందేమి?

"ధాన్యం, పెద్ద పశువులు. చిన్న పశువులు, కోళ్ళు, ఇవన్నీ జనం నుండీ సైన్యం తీసుకోవాలి. ప్రతి యింటిలో బాగా సోదాచేసి యేగుడ్డలున్నా యింకేం దొరికినా స్వాధీనం చేసుకోవాలి. యే కొంచెం యెదిరించినా అక్లే కాల్చి వేసి కొంపల కగ్గిపెట్టండి."

ఇట్లా యీ సైన్యం దోపిడీ దొంగల గుంపుగా అధికారులే తయారు చేస్తున్నారు. యీ విషయంలో రెడార్మీ జనరల్ రొకొసొవస్కీ— అన్న మాటలివి :

"ఇంతకూ యిది నిజమైన సైన్యం కాదు. ఇదో దోపిడి సైన్యం. వీరికి ధాన్యం దోచుకోవాలనే వాంఛ బలీయంగా వుంది. ఇది వ్యాపార సైన్యంకానీ వాస్తవ సైన్యంకాదు."

సైన్యాక్రమణ అవుతూనే ప్రభుత్వమే అక్రమిత ప్రజా సౌభాగ్యాన్ని పీల్చివేయడానికి జలగ పట్టు పట్టుతుంది ఆధునిక 'ధనిక స్వత్వపద్ధతి' మనాపలీ కాపిటల్ — ద్వారా కరెన్సీ పద్ధతులద్వారా బాంకులద్వారా అమాల్గమేషన్-షేరు కంట్రోలు — హోల్డింగు కంపెనీలద్వారా, అక్కడ ఇన్ఫ్లేషన్ కల్గించడం ద్వారా ఆర్థికంగా దేశాలను నాశనం చేస్తున్నారు. ఆ దేశాల్లోవున్న వివిధ ఉత్పత్తి కేంద్రాలనూ నాజీ యుద్ధ సరఫరాకు బలవంతంగా పనిచేయిస్తూ దేశీయావసరాలను ఉపేక్ష చేస్తున్నారు. పరిశ్రమ లన్నిటినీ యుద్ధ పరిశ్రమలుగా మార్చి వేసినారు. లేకపోతే ముడిసరుకు సరఫరా నాపివేస్తారు. తిండిలేక మాడుతున్న

వారిని భయపెట్టి వెట్టిచేయించుకుంటూ అది చాలక జర్మనీకే జనాన్ని పట్టుక పోతున్నారు. "ఇప్పటికీ 20 లక్షల మందిని తీసుక పోయినారు." (పామీదత్తు)

సేద్యపు పశువులనూ ఫలాన్నీ ఆహారపదార్థాలనూ స్వాధీనపఱుచుకున్నారు. కొన్నిచోట్ల యంత్రాలనుకూడా. "ఈ వారంలో మాత్రమే — సెప్టంబరు 16—22—డెన్మార్కు—నుంచీ 17000 ఆప్పుడే కోయడానికీ, 2000 మేపడానికి గొర్రెలను తోలుక పోయినారు. అట్లాగే 11000 రీన్‌వాలా పడమటి జిల్లాలకు తోలుకొని పోవడంవల్ల ఒక్క వారంలోనే వెన్నలో 9/10 భాగం కోల్పోయినారు. నెదర్లాండ్సులోని 28000000 కోళ్ళల్లో యీ శరత్తులో 22000000 ను చంపుతున్నారు." (టైమ్సు సెప్టంబరు 20-1940)

ఇందులో ప్రత్యేకం సిద్ధపరచిన 'ఊహానాణ్యాలను' — ఇల్యూషన్ మార్కులు — బనులిస్తారు. వీటి మారకపు రేటు చాలా యెక్కువ. దేశం ఆర్థికంగా జర్మనీ ఆర్థిక విధానంతో కట్టుబడుతుంది. కరెన్సీలో హెచ్చు తగ్గులు కలుగుతుంది. ఆ నాణ్యాలతో జర్మనీ నుంచీ వస్తువులు కొనవలెను. అవి పాడు ప్రియం ధరలకు అమ్ముతారు. అన్నందాలా పీడించడం చక్కగా జరుగుతుం దన్నమాట.

అక్రమిత రాజ్యాలు ఆక్రమిత సైన్యాలకుగానూ యేటా, 900,000,000 అంటే జనాభాలో తలాకు 12 పౌనులు చెల్లించాలి. ఈ మొత్తంతో బ్రిటీషు స్థాయిలో 8000,000 సైనికులను పోషించొచ్చు:

నాజీ లింతవఱకూ మొత్తంమీద 100,0000,000 నుంచీ 1100,000,000 వఱకూ యేటా ఆక్రమిత రాజ్యాల నుంచీ రాబట్టుతున్నట్లు లెక్క వేయబడింది: అంటే యుద్ధానికి

ముందు ఆయా దేశాల దేశీయాదాయంలో 1/5 వంతు. ఇంక ఆస్తీ పాస్తీ ఫ్యాక్టరీలూ యంత్రాలూ ఆయుధాలూ, సామానులూ స్వాధీనం చేసుకొన్న వెన్నో లెక్క కట్టలేము. సోవియట్ యుద్ధానికిముందే బంగారూ ప్రభుత్వం ధనమూ మాత్రమే 1000,000,000 పౌనులుగా లెక్క కట్టబడింది.

ఒక్క ఫ్రాంసులోనే యుద్ధ విరమణకూ 1941 డిశెంబరుకూ నడుమ జర్మను పత్రికల లెక్క ప్రకారము 200,000,000,000 ఫ్రాంకులు: ఇదీ ఒకటిన్న రేండ్ల ఆక్రమణకు లాభం. గోధుమ పంటలో సగం, ద్రాక్షారసంలో 80%. ఉర్లగడ్డలూ, చెఱుకూ పూర్తిగా. కొన్నిలక్షల పశువులూ జర్మనులు లాగినారు. 1941లో ఫ్రెంచి కార్ఖానాల ఉత్పత్తిలో 90% తీసుకున్నారు. ఉత్పత్తైన మోటారులలో 85% లాక్కున్నారు. అరువేల ఫ్రెంచి వ్యాపార సంస్థలను వారి ముడిసరుకుతోనే జర్మనీకి వస్తువుల సరఫరా చేసేట్టు విధించినారు. ఆక్రమిత పరాసులో 1942 ప్రారంభానికంతా పరిశ్రమలన్నీ 80% పాళ్ళు జర్మన్ ఆర్డర్లతో నిండిపోయినవి."

(ఎకానమిస్టు: ఫిబ్రవరి 21, 1942)

ఇట్లా ఆహారపదార్థాల రవాణావల్ల ఫ్రెంచి ప్రజలు ఆకలితో మాడి చావవలసి వచ్చింది. సీన్ డిపార్టుమెంటు హెల్తాఫీసు లెక్కల మేఱకు 1942 జనవరిలో మరణ సంఖ్య 1939 జనవరి కంటే 49% ఎక్కువ. పిల్లల మరణం 50% ఎక్కువయింది. విషీలోని ఆరోగ్యశాఖ లెక్కల ప్రకారం 1941 అక్టోబరులో కిండర్ గార్టెన్ పిల్లలు 52% జబ్బునడినారు. పూర్వార్థంలో పిల్లల మరణసంఖ్యమూడింతలు పెరిగింది.

(హామీదత్తు)

ప్రజల ధైర్యం విచ్ఛిన్నం చేయడానికీ భీతావహం కల్గించడానికీ వీరకలంబిస్తున్న ఘోర హింసావిధానం దుర్భరమైనది. ఏహ్యమైనది. ఏ సభ్యజాతీ మఱచిపోరానిది. 'పోలెండులోని జర్మన్ల నూతన విధానం' పోలిష్ ప్రభుత్వం 1942 మొదటొక కరపత్రం ప్రచురించింది. అందులో నాజీలుచేసిన ఖూనీలూ కాల్పులూ ఖైదులూ కడుప్రమాదప్పలూ సాక్ష్యంతో ఋజువు చేసినారు. యుద్ధం ముగిసినాక యిళ్ళముందటే 80000 జనాన్ని చంపినారు. వేలకు వేలమంది జైళ్ళల్లో చసిపోయినారు. బానిసల్లా పని చేయించినారు. విద్యాలయాలనూ హైస్కూళ్ళనూ కడకు ప్రారంభ పాఠశాలలనుకూడా మూసివేసినారు.

రుమేనియా ప్రభుత్వం 1942 మార్చిలో ప్రచురించిన రిపోర్టు ప్రకారం: సెర్బియాలో: జర్మన్ ప్యునిటివ్ ఎగ్జిబిషనులు ఒక్క మాక్వా ప్రాంతంలోనే 15000 కు పైగా చంపారు. పల్లెలు పల్లెలే పరశురామ ప్రీతి చేసినారు. పశువులు తోలుకొని పోయినారు. రుడ్నిక్ ప్రాంతంలో గార్న్జీ మిలానోవార్ పట్టణాన్నే దగ్ధం చేసినారు. 450 ఇండ్లకుగానూ 42 యిండ్లు మాత్రమే మిగిలినవి. క్రాగ్జైవోలో 6000 మందిని కాల్చినట్లు అధికార ప్రకటనే చేసినారు. క్రాగుజెవావ్‌లో హిట్లరుచేసిన అవసర ప్రకటన యిది: 'ఒక్క జర్మన్ సోల్జరును చంపితే 100 మంది సెర్బియనులను చంపుతాం. ఒక్క జర్మన్ సైనికుణ్ణి గాయపరిస్తే 50 మంది సెర్బియనులను కాలుస్తాం. ఇండ్లలోనుంచీ కాలిస్తే ఆ యిండ్లల్లోని 15 యేండ్లకు మించిన వయసువారందరినీ కాల్చి ఆ యిండ్లనే ధ్వంసంచేసి భస్మం చేసేస్తాం" ఈ నోటీసును వూరంతా అంటించారు. నిస్సందేహంగా అం

దులో వ్రాసినంతకన్నా యెక్కువ ఘోరాలు తప్పక జరిగి వుంటాయి.

ఇంక ఫ్రాన్సులో వీరు జరిపిన ఘోరహత్యలకు అంతూ పొంతూ లేదు. ఫ్రెంచి పార్లమెంటు సభ్యులను — కమ్యూనిస్టులనూ — సోషలిస్టులనూ — కాల్చివేసినారు. జైళ్ళల్లో వేసినారు. గాబ్రియల్ పెరీ—కమ్యూనిస్టు — రేమా గాయ్ లెకమా సెమాల్ మొదలైన యెందరో ప్రసిద్ధ ప్రముఖ ప్రజానాయకులను ఉరితీసినారు. ఒకేతూరి 27 మంది కమ్యూనిస్టులను కాల్చమని ఉత్తర్వు చేశారు. 20 నిముసాల టయిమిచ్చినారు. వాళ్ళ వాళ్ళను కలుసుకొమ్మని. ఒకాయన భార్య వచ్చింది. చూచిం దందరికైపూ. అందులో విడిగీ విడగని పూవులా పదిహేడేండ్ల పిల్లవాడున్నాడు. ఆమె మాతృ హృదయం కలగి పోయింది ఉడికి పోయింది. ఆ అబ్బాయిని వదలండి నేనాతని ప్రాణం తీసుకంటూ నన్నదామె. కానీ అధికారు లొప్పుకోరు కదా. కాల్చి వేశారు. అందులో ఒకడు కాల్చేటప్పుడు "జర్మన్ కమ్యూనిస్టు పార్టీ వర్ధిల్లాలి" అని అఱచాడు! యెంత కటిక వాడైనా జాత్యహంభావమనే మత్తు మందుతో కైపెక్కిన ఆ జర్మన్ సోల్జరు బుఱ్ఱలో ఉత్పాతం పుట్టి వుండదూ ఆ మాటకు (పెజ్ అర్నాట్: ఫ్రెంచి ప్రజల హిట్లరు విరుద్ధ పోరాటం) ఇదొక చిన్న సంఘటన. ఇట్టివి వేలకూ లక్షలకూ. నార్వేలోని ప్రజానాయకు లెందఱినో ఉరి కంబాల కెక్కించినారు. పౌరులను నానా చిత్రవధలపాలు చేసినారు. కొందఱెట్లో తప్పించుకున్నారు. వారి ద్వారావచ్చిన యీ వార్తలను 1942 మార్చిలో స్వీడిష్ పత్రికలు ప్రకటించినవి. యీ పత్రికలను స్వీడిష్ ప్రభుత్వం నిలిపి వేసింది.

ఇంక సోవియట్ యూనియన్ ఆక్రమిత ప్రదేశాలలో వీరు మహాదారుణంగా ప్రజలను హింసిస్తున్నారు. అక్కడ తమ కొక్కడూ దేశద్రోహి దొరక్కపోవడం మూలాన వారి హింసాదీక్ష మరింత ఘట్టిపడింది ! వారిలోని పశుతా రాక్షసి కోరలు చాపి వికటాట్టహాసంతో విజృంభించింది. ఫీల్డు మార్షల్ వాన్ రీచ్నో 1941 అక్టోబరులో ప్రకటించిన 'ఆర్డర్ ఆఫ్ ది డే' లో స్థానికంగావున్న సోవియట్ జనాన్నందరినీ చంపమనీ చారిత్రిక భవనాలన్నిటినీ విధ్వంసం చేయాలనీ ఉద్బోధించాడు :

"స్థానిక ప్రజలకూ యుద్ధ ఖైదీలకు తిండి యేర్పాట్లు చేయడం, అవసర జీవ కారుణ్యం... సైనిక నివేశాలుగా పనికివచ్చే భవనాలను మాత్రమే సైనికులు కాల్చకుండా ఉంచాలి. బోల్షివిక్ పరిపాలనా చిహ్నాలైన మిగత వన్నిటినీ నిర్మూలించాలి. ప్రాచ్య చారిత్రిక కళావిధానా లేవైనా యే మాత్రం బాధలేదు.

పల్లెలూ పట్టణాలూ నేలమట్టం చేసినారు. ప్రజాభవనాలూ ఫ్యాక్టరీలూ వర్కుషాపులూ స్కూళ్లూ లైబ్రరీలూ ఆస్పత్రులూ చర్చిలూ పాడుచేసినారు. కళాభవనాలను కాడుగా మార్చినారు గోర్కీ చకోవ్‌లాంటి ప్రపంచ ప్రసిద్ధ రచయితల స్మృతి చిహ్నంగా యేర్పడిన ప్రదర్శన భవనాలను కూడా ఉండనీలేదు. ఒక్క పల్లెలో 998 యిండ్లలో 960 కాల్చివేసినారు. ఇంకొక పల్లెలో 602కి గానూ 564ను భస్మచేసినారు. ఒకదానిలో 233కి 224 బుగ్గిబుగ్గి. వూరూరా వీధి వీధులా ఉరికంబాలు నాటించారు. మనుషులను వేలాడగట్టి ముక్కముక్క తఱిగి చిత్రవధ చేసినారు, ఆహార ధాన్యాలూ, పశువులూ, కోళ్ళూ,

గుడ్డలూ పరుపులూ పాత్రిలూ అన్నీ దోచుకొన్నారు. బట్టలు విడిపించి ఆడ మగ అనకుండా కొరడాలతో కొట్టినారు

మంచులో - రష్యా - దొర్లించారు. గర్భిణీ స్త్రీలనూ పసి గందులనూ చెరిచారు. పిల్లలను కాల్చి చర్మం వొలిపించారు. తల్లుల కండ్లయెదుట నరికారు. పీనుగలకు ప్రదర్శనా తేర్పఱచినారు. కీవు పట్టణంలో కొన్నాళ్ళల్లోనే 52000 మందిని కాల్చేశారు చిత్రవధ చేశారు. ఒకోవ్‌లో 6000; ఒడెస్సాలో 8000; కామెనెట్ పొడొలా స్కీలో 8500 మంది; నీపోత్ పెట్రోవాస్కీలో 10500 మెషీన్ గన్లతో కాల్చినారు.

ఇవన్నీ యింకా వివరంగా మాలతోవ్ ప్రకటించిన కర పత్రం — 6–1–42 — తెల్పుతుంది.

ఇంక నాజీలచేతికి దొరికిన ఖైదీల బాధలు వర్ణనాతీతం. కాన్సంట్రేషన్ కాంపుల్లో బందెలదొడ్లల్లో పశువులకన్నా కనాకష్టంగా చూస్తూ పైగా బాధలు పెడుతున్నారు. "రెడార్మీ ఖైదీల కనుగుడ్లను యెర్రగా కాల్చి కత్తులతో కాలుస్తున్నారు. కాళ్ళూ చేతులూ ముక్కూ చెవులూ కోసివేస్తున్నారు. కడుపులు కోస్తున్నారు. టాంకులకు వారినికట్టి నజిబిజి చేస్తున్నారు."

సోవియట్ స్త్రీలు జర్మన్ స్త్రీలకిట్లా విజ్ఞప్తిచేసినారు "జర్మన్ స్త్రీలారా! నాజీ ఆక్రమిత సోవియట్ ప్రాంతంలో యేం చేస్తున్నా రనుకున్నారు? సోవియట్ జనంపై అనిర్వర్ణనీయ బాధలను రుద్దుతున్నారు. గర్భిణీ స్త్రీలను తుండ్లు తుండ్లుగా నరుకుతున్నారు. పడుచు తల్లుల చన్నులు కోసివేస్తున్నారు. ఆసుపత్రులపై బాంబులు వేస్తున్నారు. కిండర్ గార్టన్‌కు అగ్గిపెడుతున్నారు. అగ్గిలో మనుష

అనే వేస్తున్నారు. నూర్ల మందిని చిత్రవధ చేస్తున్నారు. రెడార్మీ జనాన్ని కండ్లుపీకి మొగాలమీద నాజీ చిహ్నాలను వాతలు వేస్తున్నారు.''

ఈ ఘోర దురంతాలు నూర్లకూ కోట్లకూ వర్ణించొచ్చు. ఇంకా అక్రమిత ప్రదేశాలలోనుంచీ మనకు సరైన వార్తలు రావడంలేదు. పూర్తిగా ఫాసిజాన్ని రూపుమాపిన తర్వాత గానీ యీ వార్తలు మనకు చేరవు. నొవొరొసిస్ అనే పట్టణంలో కొన్న ఫాసిస్టులనుంచీ రెడార్మీ వదిలించిన తర్వాత వేలజనానికి ఒక్క పౌరుడుకూడా కన్పించలేదని రెడార్మీ అధికారులు ప్రకటించినారు ఇట్లా యెన్నిచోట్ల యేమేమి చేసినారో: ఒక్కొకచోట కన్యల నురిదీసికూడా వీరి కార్యాన్ని అణచుకోలేక పోయిన ఘాతుకులు. తాన్యా అనే వీరకన్య కథ మనల నడికించి వేస్తుంది ఈ వివరాలలో సోవియట్ ప్రచురణలలోని కొన్ని కథలూ ప్రకటనలూ మనకు కొంతకు కొంత తేట పరుస్తుంది.

ఇదీ నాజీలు అక్రమిత రాజ్యాల్లో చేస్తున్న పని

ఇక జపాను ఆక్రమిత ప్రదేశాల సంగతి మనకెక్కువ తెలీదు. ఒక్క చీనా సంగతే మనకు తెలుసు. రైతులనూ అమాయక ప్రజనూ విశ్వవిద్యాలయాలనూ ఆసుపత్రులనూ బాంబు చేసినారు తమ పాలన నొప్పుకోని ప్రజాసేవకులను నాజీలకన్నా ఘోరంగా చిత్రవధలు చేసినారు. షాంగైలో విదేశీయులకూ మిషనరీలకూ వీరుచేసిన అవమానాలు ఘోరాలూ దిక్కులేనన్ని ఒక్కటూ రెండా చిత్రా యివ్వడం కన్నా యివ్వనివానితో ఊహించుకోనడం సులభం.

ఇదీ ఫాసిస్టుల న్యాయ అర్థము.

---

# ఫాసిజం: వినాశదశ

స్టాలిన్‌గ్రాడులో జరిగిన సైనిక మహాపజయంతో ముస్సోలినీ పదభ్రష్టతతో ఫాసిస్టు వినాశదశ స్పష్టంగా ప్రారంభమైంది.

ఫాసిస్టులు మాస్కో లెనిన్‌గ్రాడుల వఱకూ చొచ్చుకొని పోగలిగినారు. ఉన్నట్లుండి నిరాక్రమణ సంధిని భంగపఱచి సోవియట్ యూనియన్‌మీద పడడంతో, మహోత్కృష్ట సైనిక బలంతో యీ పని జరిగింది. కానీ ఆ ప్రజల ఐక్యతా, ప్రభుత్వ ప్రజా అభిన్నతా, రెడార్మీ శక్తి సత్తా చేవకూర్చుకొన్నది. చలికాలం మంచుదొర సాయపడడమే కొంత సోవియట్‌కు బలం చేకూర్చినదని అనుకొన్నారు. అది కాదని యీ యేడు రూఢిపడింది. అమూల్య తైల సంపద కలిగిన కకేషియావైపు రెండో యేడు ఫాసిస్టు సైన్యం ఎగబ్రాకింది. స్టాలిన్‌గ్రాడులోని కొన్ని వీధు లనే ఆక్రమించ గలిగింది. కానీ కొత్త సైనిక వ్యూహం వేసింది రెడార్మీ. వీధి వీధికీ సందు సందుకూ యింటి యింటికీ అంతస్తంతస్తుకూ గది గదికీ, అంతేమి అంగుళ మంగుళానికీ, దారుణంగా సంగ్రామం జరిగింది. ఆ సాహసం ఆ స్వతంత్రదీక్షా, దేశభక్తీ, ఆధునిక సేనావ్యూహ ప్రతిష్ఠతా ప్రపంచాన్ని దిగ్భ్రమ చెందించింది. అక్కడో సైనికు డన్న మాట నిజం: ఒక్క అయిదంతస్తుల మేడలో యుద్ధం ఘోరంగా జరుగుతున్నది. రెండంతస్తు లంతకుముందే పడినవి. మూడోది కూడా కొంతసేపటికి కూలిపోయింది. అప్పుడా పక్కనున్న సైనికుడు తాత్వికంగా అన్నా డామాట:

"పట్టణం ఆలసి పోయింది. మేడ లలసిపోయినవి. యిటుక లలసిపోయినవి. మన మలసి పోలేదు!"

ఆ ధైర్య దీక్షతో స్టాలిన్‌గ్రాడులోని నాజీ సైన్యాన్ని ఉరివేసి బంధించినారు. ఒక్క పురుగు మిగలకుండా నలిచి పారవేసినారు. యీ యుద్ధంలో జరిగినంత సర్వనాశనం యెప్పుడూ జరగలేదు. దీనితో వారి నడుము విరిగేటంత దెబ్బ తగిలింది.

ఈతూరి – 1943 – వేసవిలో హిట్లరెంతో సన్నాహంతో మరీ దాడి కుంకించి కొన్ని రోజుల్లో కుంచించుకొన్నాడు. రెడార్మీ తన్నుమీద తన్ను తంతూ యుక్రైన్ వలకూ తోసుకోపి నాజీ ఆక్రమిత ప్రదేశాలను పునరాక్రమిస్తున్నాయి. యిది రాస్తూ రాస్తూండగానే యెంత వలకూ నాజీలను తరిమివేస్తారో చెప్పనూలేము ఊహించనూలేము. హిట్లరు ధోరణికూడ మారినది. రెడార్మీ వీరిమీద పడినట్లున్నది! ఇందుతో మన కాతని దురాక్రమణ దృష్టి దోషం తొలగుతూఉందని కడకు తన సరిహద్దు రక్షణ కిందికి తన ఆదర్శాన్ని దించుకొన్నాడనీ కనబడుతూవుంది. ఇప్పుడు ఫాసిస్టు యుద్ధయంత్రం తుప్పుపట్టి పోనారంభించింది.

ఈ అపజయాలతో పూర్తిగా ఫాసిస్టులు లొంగిపోయినారని కాదు. కానీ వారి సైన్యాలమీద గొప్ప నైతికశక్తి పతనాని కివి ప్రాబల్యం చూపించి తీరుతాయి. ఇన్నాళ్ళూ వాళ్ళకు ప్రపంచంలో తమ జాతి అజేయమైనదనీ ప్రపంచాన్నంతా ఆక్రమించుకునే శక్తి తమకున్నదనీ ఉన్న భ్రమ తొలగుతుంది. విజయ పరంపరతో తల దిరిగిపోతూన్న వారికీ పరాజయాలు కొంత బాహ్య సత్యదృష్టిని ప్రసాదిస్తాయి.

ఫాసిస్టు రాజ్యాల్లో జర్మనీ తర్వాత యిన్నాళ్ళూ ఇటలీ ప్రభుత్వం. అధినేత ముస్సోలినీ 1922 నుంచీ ఫాసిస్టు పాలన చేస్తున్నాడు. ఫాసిజం అనేపేర యీ హింసా సిద్ధాంతాన్ని ప్రసాదించినవా డామహనీయుడే. యుద్ధ ప్రారంభం నుంచీ ముసులోనీ బహుతీవ్రంగా రోమక సామ్రాజ్య పునరుద్ధారకుడుగా మాటలాడినాడు. అభ్రిమతో దేశీయ ప్రజలను మభ్య పెట్టినాడు. యూరోపులో చిన్న రాజ్యాలతని వాగ్ధాటికే అదిరి పోయ్యేవి. కానీ రెడార్మీ విజయాలూ, మిత్ర రాజ్యాల సేనలు ట్యునీషియాలో విజయ శంఖం పూరించి సిసిలీ నాక్రమించి వెయ్యడమూ, జర్మన్ సేన లేమాత్రమూ పూర్తిగా ఇటలీ రక్షణం బాధ్యతను వహించక పోవడమూ, ఇటలీ సైన్యంలోనే ఫాసిజం పై అసహ్యాన్నీ విసుగునూ కల్గించినవి. ప్రజల్లో అతివిపరీత సంచలనం కలిగింది. ముసులోనీ నొక్కనాడు బంధించి నారు. బడాగ్లియో ప్రభుత్వ మేర్పఱచినారు అప్పుడు ప్రదర్శనాలు చూస్తే ముసులోనికీ ఫాసిస్టు ప్రభుత్వానికీ విరుద్ధమైనవే యెక్కువ కానీ ఫాసిస్టు ప్రదర్శనాలు తక్కువ. అవి ప్రజాద్వేషాన్ని వెలార్చినవి కడకు ఇటలీ ప్రభుత్వం మిత్రమండలి కేష తులు లేకుండా లొంగిపోయింది. ముసులోనీని హిట్లరు తప్పించినాక రేడియోలో ఇటాలియన్ ఫాసిస్టుల నింకా ఉసికొల్పుతున్నాడు. జర్మనీ ఉత్తర ఇటలీ ఆక్రమణను బలపరుస్తున్నాడు కానీ పదభ్రష్టతా, ప్రజల ఆందోళనా, మిత్రమండలి సేనాప్రవేశమూ ఇటలీని ఫాసిజం నుండీ వదిలించివేస్తున్నది. కొంత వదలించినది.

ఇందుతో ముఖ్య ఫాసిష్టు రాజ్యాల్లో ఒకటి శిథిలత మైంది. ఫాసిజం వినాశదశ బాగా సుస్పష్టమైంది సైనిక తంత్రంగా ఇవి పరమోత్కృష్ట విజయాలు కాకున్నా

నైతికంగా ప్రబలమైన వివి. అప్పుడే మిగతా చోట్లల్లో తీవ్రంగా ఫాసిజానికి తిరగబడుతున్నారు. ఫాసిస్టు ప్రభుత్వాలెంత కృత్రిమమైనవో అసహజమైనవో తెలిసిపోయింది. స్వీడెన్ డెన్మార్కు రుమేనియా నార్వేలలో తిరుగుబాటు లారంభమైనవి. ఫ్రాంసులో ప్రజాపక్ష కృషి తీవ్రతరమైంది బల్గేరియాలో క్రొత్త ప్రజా సంచలనం కనబడుతున్నది. ఫాసిస్టు ఆజ్ఞలను తిరస్కరిస్తున్నారు. ఇంకా యెన్ని దేశాలు ఈ ఫాసిస్టుల నుండి విముక్తికై విజృంభిస్తాయో ఊహించలేము.

---

# ఫాసిజం: విరుద్ధ ప్రజా సంఘటన

సేడీ ఫాసిస్టు దౌర్జన్యం ప్రజల కండ్లు తెటిపించింది. ప్రపంచ సభ్య స్వతంత్రప్రియ ప్రజాసమూహం సంఘటిత మౌతున్నది రానురానూ ప్రపంచ ప్రజాసంఘటన బలపడు తున్నది.

1942 జనవరి ఒకటో తేదీ సోవియట్ యూనియన్, అమెరికా సంయుక్త రాష్ట్రాలు, బ్రిటన్, డొమినియన్లూ చైనా రిపబ్లిక్కూ మరి 26 రాజ్యాల ప్రతినిధులూ కలిసి మిత్రమండలి సంధి చేసుకున్నారు ఇది ప్రపంచ సంఘటనకు రేఖాచిత్రం మాత్రమే. ఇందులో చేరడానికి “యే జాతులు హిట్లరిజాన్ని జయించడానికి సహాయంచేస్తున్నాయో చేస్తాయో” అట్టివన్నీ యిందులో చేరడానికి వీలున్నది.

ఈ మిత్రమండలి కేవలం ప్రభుత్వాలకూ, ప్రభుత్వాలకూ మధ్య యేర్పడిన సంబంధమే కాక అయాదేశ ప్రజా సద్భావం సహకారం దీని కండగా నున్నది. వివిధ అభ్యుదయ పక్షాల వారూ యితరదేశ ఫాసిస్టు ప్రతిపక్షంవారూ యిందుకు తోడ్పడుతున్నారు. ఫాసిస్టు పశుత్వాన్ని సహించని వాళ్ళందఱూ యిందులో చేరుతున్నారు. పరిస్థితులూ నిరోధక శక్తులూ అడ్డంకిగావున్నచోట్ల యీ సంఘటనలో చేరేందుకై ప్రజలను సమీకరిస్తున్నారు ప్రజాభిప్రాయాన్ని సంఘటితపరుస్తున్నారు.

బ్రిటనూ, సోవియట్ యూనియన్, అమెరికా కలయిక యుద్ధ సమగ్ర సంపత్తికి నిధానమైంది సోవియట్ యూనియన్ స్వతంత్ర దీక్షా సంగ్రామశక్తీ, మిగతావారి ఉత్పత్తి శక్తీ దినదినాభివృద్ధి చెందుతున్నది యీ సంఘటన మరింత బలపడడానికి వారి విజయాలు కారణమైనవి.

ఆక్రమిత రాజ్యాల్లోని ప్రజోద్యమాలు మరింత దీని బలపరుస్తున్నవి.

అధికారవర్గ వంచితులైన ఫ్రెంచి ప్రజలు తొలినుంచీ మహోత్సాహంతో ఫాసిస్టు విరుద్ధ పోరాటాన్ని రహస్యంగా సాగిస్తున్నారు. డీగాల్ నాయకత్వం కింద జాతీయ పక్షం స్థాపించబడింది. జనరల్ జీరో నాయకత్వం కింద ఆఫ్రికాలోని సేనలు హిట్లరు కీలుబొమ్మ రాచరికాని కెదురు తిరిగినవి. ఫ్రెంచి నావికాదళం వశం కాలేదు హిట్లరు వశపఱుచుకోవడాని కాజ్ఞాపించినాడు. కాని నావికా దళాధికారులలో స్వతంత్రాగ్ని ప్రజ్వలించింది. నాజీలకు దొరికిపోవడంకన్నా ఆత్మవినాశం మేలనుకున్నారు. దేశమాతృదాస్య విచ్ఛిన్నతకిదికూడా మార్గమే ననుకున్నారు.

కడకు వారికి దొరకనీకుండా చెయ్యడమే విశ్వమానవ ఉపకృతిగా భావించినారు. ఒక్కొక్కడిగా నాజీలను అగ్నికాహుతి చేసినారు. స్వతంత్ర జ్వాలలనూ అక్రమబలి దిశాంతాల కవగతం చేస్తుండగా సముద్రాంతరాళంలోనికి వెళ్ళిన, వా నౌకాయా నాధినేతలతో బాటూ. ఆ దినమే నాందీ జరిగినది. వివిధ ప్రజాపక్షాలూ యేకమైనవి. నాజీలు ప్రాణం చేతిలో బెట్టుకొని తిరగవలసి వచ్చినది. యెందరో హతులైనారు. గంట గంటా ఫ్రెంచి గెరిల్లాలు నాజీలను వేధిస్తున్నవి ఎన్ని మరణదండనలూ కాల్పులూ చిత్రవధలూ జరిగినా వారి స్వతంత్రదీక్ష తగ్గలేదు. అనన్య పరాక్రమంతో పోరుతూనే వున్నారు.

కమ్యూనిస్టు పార్టీ అహోరాత్రులూ యీపోరాటంలో విశ్వరూపంతో పనిచేస్తున్నది. నాయకుడు థోరేపై మరణదండన విధించినారు. వీరికి దొరకలేదు. రహస్యంగా వివిధ ఫ్రెంచి ప్రజారాజిని బారులు తీరుస్తున్నాడు. దిక్కులేనన్ని చోట్ల తిరుగుబాట్లు జరుగుతున్నవి. ఫ్రెంచిపార్టీ పత్రికలు విరివిగా గెస్టపో కళ్ళెదుటనే పంచబడుతున్నవి. వెలువడిన కరపత్రాల సంఖ్యకు మితిలేదు. స్వతంత్ర పరాసు జనతాశక్తి నెవ్వరూ ఆపలేరు. లోలోన రగులుకొంటూన్న యీ అగ్నికణాలు జ్వాలా జాజ్వల్య మానంగా దిక్కులకు ప్రాకి ఫాసిస్టు ప్రభుత్వాన్ని కూలదోస్తాయి.

యుగోస్లోవియాలో పరిపూర్ణంగా నిర్మాణయుతమైన ప్రజా చర్యలు రేకెత్తుతున్నవి. నాజీ సేనలతో ప్రజలు గెరిల్లా పోరాటం సాగిస్తున్నారు. శాంతంగా ఉండనివ్వడం లేదు. ఫాసిస్టులు తెగబడి పశువృత్తితో అణచివేయ జూస్తున్నా అవాగడం లేదు.

డెన్మార్కులో నాజీ లిష్టం వచ్చినట్టు అజ్ఞాపించడం మొదలు పెట్టగా ప్రభుత్వమే దాసోహమ్మని అనలేక పోయినది. లోనున్న ద్వేషం పొంగి వచ్చింది. ఫాసిస్టులు ప్రభుత్వ వర్గాన్ని అరెష్టు చేస్తున్నారు. ధిక్కరించిం దనడంలోనే యేదో తీరకపోయినా ప్రజలీ కర్తవ్యాన్ని బలపరుస్తున్నారు. ఇందుతో తీవ్రమైంది.

నార్వేలో: ఉపాధ్యాయులు నాజీల యిష్ట ప్రకారం పాఠ ప్రవచనాలు జరపమని తిరస్కరించినారు. వ్యతిరేక భావం ప్రబలింది, గెరిల్లాలు నాజీ యుద్ధ ప్రయత్నాలను భగ్న పరుస్తున్నారు విధ్వంసక చర్యలు మితిమీరి పోతున్నవి.

జెకోస్లోవేకియాలో: నాజీ గవర్నరు హైడ్రిక్‌ను కాల్చి వేసినారు. ప్రజలు తిరుగబడుతూ అడుగడుగునా ఫాసిష్టులను ఉక్కిరి బిక్కిరి చేస్తున్నారు.

బల్గేరియాలో: ప్రభుత్వం ఫాసిష్టులది కానీ ప్రజలు పూర్తిగా తద్వ్యతిరేకులు. రాజు బోరిస్‌ను ప్రజలు కాల్చి వేసినారు. ప్రజలచర్యలు విధవిధాలా రేకెత్తు తున్నవి. విపరీతమైన సన్నాహాలు జరుగుతున్నవి. ఎప్పుడో ఏక్షణమో తిరుగుబాటు జరుగుతుంది.

రుమేనియాలో: ఫాసిష్టు ప్రభుత్వం పడిపోయేట్టుంది. ప్రజలందఱూ తిరగ బడినారు. గెరిల్లా యుద్ధం నిజమైన సంగ్రామంలాగా తయారవు తూంది. ప్రజా ప్రభుత్వం యేర్పడి నాజీలతో యుద్ధం ప్రకటించ గలరు

ఈ ఆక్రమిత దేశాల సంగతి మనకు పూర్తిగా తెలియదు. కారణ మక్కడి నాజీ వార్తానిర్బంధ విధానం. అయినా తప్పిదారి వచ్చిన వార్తలే యింత తీవ్రంగా వుంటే నిజ పరిస్థితు లింకెంత పరిపక్వస్థితికి వచ్చినవో తెలుసుకో వచ్చును.

జపానాక్రమిత చైనాలో మహాయుద్ధం జరుగుతూంది. చైనా కమ్యూనిష్టుపార్టీ మహా ప్రాముఖ్యంతో జపాను మూకలను చించి చెండాడు తున్నది. నాయకార్థపు ప్రభుత్వం నాలుక జాపుతున్నది. కొరియాలో జపాన్ విరుద్ధ పోరాటం తీవ్రంగా జరుగుతున్న ‌. వేలకు జైళ్ళల్లో పడినా నూర్లకు ఉరిశిక్షలు పడినా మరింత ప్రజ్వలిస్తూనే ఉన్నది. చీనాలో కమ్యూనిష్టుపార్టీ జాతీయ ప్రభుత్వంలో కలిసి అనన్య సామాన్యైక్యతతో జపాను ఫాసిజం గుండెల్లో బాకు పోట్లు పొడుస్తున్నారు ప్రజల కీనాడు ఏకైక ప్రధాన శత్రువైన ఫాసిజాన్ని భస్మంచేయడమే పరమాదర్శంగా జంకైషేకు అధ్వర్యం కింద సంగ్రామం నడుస్తున్నది. అంతః కలహాలూ స్పర్థలూ మఱచిపోయినారు. మాతృదేశ విముక్తి రక్షణ మహోన్నతంగా భావించి పోరాడు తున్నారు. ప్రజా సంఘటనలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమింప కున్నారు.

జపానులోనే కమ్యూనిష్టుపార్టీ సాధ్యమైనంత ఫాసిష్టు ప్రభుత్వ విరుద్ధ భావాలను ప్రజల్లో వెదజల్లుతూ సమీకరిస్తున్నది.

జర్మన్ అభ్యుదయ వర్గానికి చెందిన గొప్ప రచయితలూ శాస్త్రజ్ఞులూ సోవియట్ ఖైదీలైన ఆఫీసర్లూ సైనికులూ ఫాసిష్టు విరుద్ధ ప్రపంచ సంఘటనను బలపరుస్తున్నారు. మాస్కోలో వీరందఱూ కలిసి జర్మన్ స్వతంత్ర ప్రభుత్వాన్ని స్థాపించి జర్మన్ ప్రజల నుద్బోధిస్తూ ప్రభుత్వ పతనానికి పని చేస్తున్నారు.

ఇంక జపా నాక్రమించక పూర్వంకూడా — వలసలుగానున్న దేశాల్లో ప్రజలు సమీకృతులు కాలేదు. ముందు ప్రభుత్వాల స్వార్థపరత్వం సంకుచితదృష్టి ఇందుకు కారణం కానీ ప్రజాపక్షా లాదేశాల్లోకూడా పనిచేస్తున్నవి.

ప్రపంచ సంఘటన యిలా దినదినాభివృద్ధి చెందుతూనే వస్తున్నది.

కానీ యీ బలం చాలదు. బలం చేకూర్చుకోనేందుకింకా అవసరమూ అవకాశమూకూడా వుంది.

---

# ఫాసిజం: వలసరాజ్య ప్రజలు

---

"ఫాసిజం, ప్రపంచములోని ప్రజలందరికీ విరోధి — అప్పుడే కొంచెమో గొప్పో స్వతంత్రమూ స్వపరిపాలనా సంపాదించుకొన్న వారికీ, ఇంకా పరులపాలనం క్రింద అణగియున్న వారికీ సమానంగానే. ఇండియా, చైనా, తూర్పు ఆసియా, పసిఫిక్కు, మధ్యప్రాచ్యం, ఆఫ్రికా వంటి దేశాలలో నివసిస్తూన్న నూటా యిరవై కోట్ల మానవుల స్వతంత్ర పోరాటపు అవర్శ్యాలకు ప్రపంచ ఫాసిస్టు విరుద్ధ మిత్రమండలి విజయమూ, ఫాసిస్టు పరిపూర్ణ పరాజయమూ ముఖ్యావసరాలు. కానీ యీ బ్రహ్మాండ మూలబలగాన్ని చక్కగా సన్నద్ధం చేయాలంటే తమ విధియనే విషయం వారే ఆలోచించుకొని స్వచ్ఛందంగా మిత్రులై మనఃపూర్వకంగా సమ్మేళనం కావలసిందే. ఇప్పటికీ వలస రాజ్యాల ప్రజల స్వతంత్రము కేవలం రాజకీయ సమస్యే కాదు. ప్రజాప్రభుత్వ విజయానికిదొక ముఖ్యయుద్ధతంత్ర సమస్య.

ఫాసిస్టు యుద్ధాశయాలు స్పష్టంగా వలస ప్రజలకు విరుద్ధమైనవి. ఇండియాకు విరుద్ధమైనవి.; పూర్వం వలస రాజ్యంగా ఉన్న చీనాకు విరుద్ధమైనవి — దాన్ని తిరిగీ దాస్య బంధితం చెయ్యడానికి ఫాసిజం చూస్తున్నది; దూరప్రాచ్య, మధ్యప్రాచ్య, ఆఫ్రికా ప్రజలకూ విరుద్ధమైనవి. ముసులోనీ అబిసీనియా ఆక్రమణా దోపిడీ, మంచూరియా ఉత్తరచైనాలపై జపాను దండయాత్ర దురాక్రమణా, యుద్ధోద్ధతిని బలపఱచినవి. మధ్యప్రాచ్య భారత దేశాలవైపు హిట్లరు చలనమూ, ఉత్తరాఫ్రికా వాయువు పట్టులమీద గుఱీ, దక్షిణాఫ్రికా దక్షిణ అమెరికాలలోకి పంచమాంగదళము చొఱుచుకొని పోవడమూ, తూర్పు ఆశియాను జపాను మెఱుపు యుద్ధములో గెలవడమూ ఇంకా ఇండియా ఆస్ట్రేలియాలవైపు ముందుకు పోజూడడమూ ఇవన్నీ ఫాసిజం సర్వవ్యాప్తం కావాలని ప్రయత్నిస్తున్నదనేందుకూ, తద్వారా స్వతంత్ర ప్రజారాజ్యాలమీదే కాక వలసప్రజ లందరిమీదా ఫాసిస్టు సామ్రాజ్యాలను నిర్మించదలచుకొన్నదనేందుకూ నిదర్శనాలు.

ఈ దండయాత్ర దోపిడీ దురాక్రమణా వగైరాలను, ప్రస్తుత పరిపాలకులనుండీ వలస ప్రజలను స్వతంత్రులను చేస్తామనే కేకల తెరలకింద ఫాసిజం దాచిపెట్టాలనుకున్నది. జపాను "ఆశియా ఆశియా వాసులకే" అనే నినాదాన్నిచ్చింది. అంటే: ఆశియా జపాను యుద్ధ ప్రభువులకే అన్నమాట. జర్మన్ ప్రభుత్వవర్గ సాధారణ సభా వార్షిక నివేదిక — 1939 యుద్ధాత్పూర్వమే నొక్కి చెప్పిందేమంటే: బ్రిటీషు సామ్రాజ్యంలోని యే స్వతంత్రోద్యమానైనా యుద్ధ తాంత్రిక స్థాన సాధనంగా బలపఱచడం ముఖ్యమని. సాహసులూ, చెప్పుచేతల్లో మెలగేవారూ, తప్పుడు తోవల్లో

పడిన వ్యక్తులూ, వలసరాజ్య జాతీయ స్వతంత్ర ప్రజోద్యమాల్లో యెక్కడైనా దొరికినారంటే – భారత కాంగ్రెసు నుండీ వెళ్ళగొట్టబడిన బోసూ – ఇరాకునుండీ రషీద్ అలీ, పాలస్తైన్ గ్రాండ్ ముఫ్తీ వగైరాలను – ఫాసిస్టు సేవనలోకి తీసుకొని వలస ప్రజలను గందరగోళం చేయడానికీ, తప్పుతోవలు తొక్కించడానికీ, ఫాసిస్టు ప్రచారోద్యోగులనుగా వినియోగింమ కుంటున్నారు.

నేడు, ఫాసిజం, తమ కషాయకరమైన పరమవిరోధనీ తమ స్వతంత్ర సంగ్రాము ప్రయోజనాలు ప్రపంచ ఫాసిస్టు విరుద్ధ మిత్రమండలి విజయంతోనూ, ఫాసిస్టు నిర్మూలనంతోనూ సంబద్ధమై వున్నవనీ, వలసప్రజ అర్థంచేసుకోవడానికి కావలసినవన్ని కారణా లున్నవి. బాధ్యతగల జాతీయ స్వతంత్ర్య్యపు నాయకులందరూ వలస ప్రయోజనాలు ఫాసిజంతో జతపడని విరోధులని గుర్తించినారు. చైనా జాతీయ ప్రభుత్వం, ప్రపంచ ఫాసిస్టు విరుద్ధ మిత్రమండలి యేర్పడేందు కన్నో యేండ్లముండే, సాయుధమైన జపాను ఫాసిస్టు దురాక్రమణ కారులతో పోరాడ మొదలిడినది. భారత జాతీయ కాంగ్రెసు ఇంగ్లీషుదేశపాలకవర్గ మింకా ఫాసిజంతో రాజీపడే పద్ధతినంచీ మఱల డాని కన్నోయేండ్లకు ముండే, చైనా అబిసీనియా స్పెయినులను బలపరుస్తూ ఫాసిస్టు విరుద్ధ పోరాటంలో ప్రధాన బహుమత పాత్రను నిర్వహించింది.

ఫాసిస్టు పశుత్వం ప్రపంచ విజయాన్ని చేకొనిందంటే వలస ప్రజల స్వతంత్రేచ్ఛ చాలా కాలంవఱకూ మానిపోయిన దన్నమాట. ఇప్పుడున్న సామ్రాజ్య పరిపాలనాభారంతో కుంగిపోతూన్నామను వలసప్రజానీకం మరీ కఠోరదారుణ

విధానమైన ఫాసిజంకింద అర్థాన్నం కాగలదు. ఏ ప్రభుత్వ తత్త్వం కానీ పాలిత ప్రజాభ్యుదయు నిరోధించేస్తే తొక్కి పెట్టడం అన్నమాటే ప్రతి వలస ప్రజల ఆదర్శమూ స్వాతంత్ర్యం పొందడమే. ఫాసిస్టు విరుద్ధ మిత్రమండలి విజయాలు, వలస ప్రజల సంపూర్ణ స్వతంత్రానికనుకూల వాతావరణాన్నేర్పరుస్తాయి.

ఫాసిస్టు వలస విధాన సూత్రాలు, మంచూరియా, ఆక్రమిత చెయినాల్లోని జపాను దారుణ పరిపాలనతో అప్పుడే ప్రదర్శితము లైనవి. నాజీ వలస కార్యాలయ ప్రచురణలలో నిర్మొగమాటంగా మోటుగా స్పష్టీకరింప బడినవి. అందులో రక్తపిపాసి డాక్టరు పీటర్సును ఆదర్శ వలసపాలకుణిగా ఒహూకరించినారు. డాక్టరు గంతర్ హీచ్ అధికార ప్రకటన చూడొచ్చు. అతను నేషనల్ సోషలిస్టు పార్టీ జాతి – రాజకీయ కార్యాలయంలో జాతి – వలస ప్రజల సమస్యల్లో నిపుణుడు. 1938 లో 'వలస సమస్య జాతి సిద్ధాంతం' అనే ప్రచురణలో నాజీ పాలకులు దేశీయుల నెట్లా పాలించవలెనో ప్రధాన సూత్రాలు తెల్పినాడు.

జాతీయ దురహంకారంలో మునిగిన ఫాసిస్టు వలస సిద్ధాంతాల ప్రకారం, పాశ్చాత్య ప్రజారాజ్యాల వలస విధానం, వినాశకరమూ, దాక్షిణ్యబద్ధమూనట వానిమీద ఆక్రోసు వెళ్ళబోసినాడు. యూరోపు సభ్యతా ద్వారంలో వలస ప్రజలకు ప్రవేశ మివ్వడంవల్లే వలస విధానం ఛిన్నాభిన్నమైందట ఏతద్వ్యతిరేకంగా నాజీ పాలనం ఇట్లాంటి నిర్వచనాలను నాశనంచేసి వలస ప్రజలను శాశ్వతంగా అధమస్థితిలో అట్టే పెడుతుందంటూరు ఫాసిస్టులు. తాము ఆర్యులూ ఉన్నతులూ అనే బురఖా వేసుకొని

రంగుజాతిని బానిసలుగా ఉండాలంటుంది ఫాసిజం. ఉన్నత పాఠశాలల్లో విశ్వవిద్యాలయాల్లో వారికి ప్రవేశముండ కూడదట నాజీ వలసలోని యేదేశీయుడూ యూరోపులో తిరగడానికి వీల్లేదట. నాజీల 'జాతి సూత్రం' వలసలకూ వ్యాపించవలెనట.

ఫాసిస్టు విజయం అంటే వలస ప్రజల కెట్లాంటిదో కళ్ళుపెట్టుకొని చూడకపోవడం, వలస ప్రజా ప్రయోజన వంచనమే అవుతుంది.

ఈ వృత్తాంతానికి మారుగా, ఫాసిస్టు దాస్యబంధన విమోచనంకోసం పోరాడే ప్రపంచ ప్రజాసంఘటనా విజయం, ప్రపంచంలోని వలసలలో ఉన్న ప్రజలందరికీ ఆశాజ్యోతి కాగలదు. సోవియట్ యూనియన్ పీడిత ప్రజా స్వతంత్ర సమానతా రక్షకంగా అగ్రగామిగా ప్రపంచ ప్రజలందరూ మొదటినుండీ గుర్తిస్తూ వచ్చినారు. ప్రవదా – మే 1; 1941 – వ్రాసినట్లుగా సోవియట్ యూనియన్‌లో చేసిన విశ్వజనీన స్వచ్ఛంద సంఘటనలో: "ఎక్కువజాతి తక్కువజాతి అని మానవులను విభజించే మృతసిద్ధాంతం, చరిత్రకు చెందిన చెత్తాచెదారంలో పారవేయబడింది." పాత జారిస్టు సామ్రాజ్య పీడిత ప్రజలు స్వతంత్ర సమానతలతో తులతూగుచున్నారు జాతీయ స్వతంత్రం కోసం పోరాడిన టర్కీ స్పెయిన్ చైనా ప్రజలకు సోవియట్ చేయూత నిచ్చింది విదేశ సంబంధాల్లో సమానత కావాలనే వారి పట్టుదల పాత జారు చేసుకున్న చైనా యిరాను సంధులను చించి పారెయ్యడంలో ద్యోతకమయింది ఇవన్నీ విశ్వమంతటా బహుమతికీ అభిమతికీ పాత్రములైనవి. మరి చైనా జాతీయ ప్రభుత్వమేమో ప్రపంచ జాతీయ స్వతంత్రోద్యమ నాయక ప్రతినిధి.

ఇంక యీ తగాదాలో సమస్త వలస ప్రజల అభిమానమూ ఆశా యేపక్ష మంటాయి? అని అడగక్కర్లేదు

వలస ప్రజలు ఫాసిస్టు విరుద్ధ ప్రపంచ సంఘటనలో పాల్గొనే విషయం ఒక్క వారి ప్రయత్నాలమీదే ఆధారపడదు. వారి సంపూర్ణ సంయోగాన్నింకా అటంకపరిచే అభ్యుదయ విఘాతాలను పూర్తిగా తొలగించవలెను. ఈ విషయంలో ప్రత్యేక బాధ్యత, ఫాసిస్టు విరుద్ధ సంఘటనలో పాల్గొంటూన్న సామ్రాజ్య దేశాల్లోని ప్రజలమీదా అందులో ముఖ్యంగా నన్నూటయాభై మిలియన్ల వలస ప్రజలుగల బ్రిటీషు సామ్రాజ్య కేంద్రంలోని బ్రిటీషు ప్రజలమీదా ఉన్నది.

ఇండియా, బర్మా, సిలోన్ వగైరా వలసలన్నిటియెడలా అవలంబించిన అభ్యుదయ నిరోధక పద్ధతి ఫాసిస్టు విరుద్ధ సంఘటనకు విఘాతమైంది. దుర్బల పరిచింది."

(పామీదత్తు. 'బ్రిటన్ ఇన్ ది వర్ల్డు ఫ్రంట్')

అందువల్లనే అన్నివిధాలా ఫాసిస్టు విరుద్ధ సంఘటన కనుకూలురైన వలస ప్రజలు పూర్తిగా యీ పోరాటంలో సమీకృతులు కాలేదు ఈ విషయంలో వూకేచీన్ అనే ప్రముఖ చైనీయుడు బ్రిటన్ అమెరికన్ అధికారుల కీక్రింది సలహా లిచ్చినాడు:

1. "వెనుకబడిన వారనీ సోమరులనీ అజ్ఞానులనీ పనికిరాని వారనీ యే ప్రజలనంటున్నారో, యే జాతులను మోటవనీ అనాగరికులనీ వారి ప్రాముఖ్యాన్ని లెక్కపెట్టకుండా వారి మీద విశ్వాసం వుంచకపోయినారో వారి విషయంలో బ్రిటీషు అమెరికన్ అధికారులు వారి దృక్పథాన్ని మార్చుకొని తీరవలెను. ఔను......ముసుపటి అభిప్రాయాలను

వదిలిపెట్టడానికీ, పాత వలసరాజ్య విధానాన్ని మార్చుకోవడానికీ, కొత్త దృక్పథంతో చూడడానికీ......విరోధపై యుద్ధావసర నిర్ణాయక నవవిధానాన్ని చేకొనడానికీ యిది తరుణం.

2 రూజ్వెల్టు చర్చిల్ సంయుక్త ప్రకటనలోని మూడవ సూత్రి మిట్లా చెబుతుంది. "తామే ప్రభుత్వం కింద వుండాలో ఆ ప్రభుత్వపద్ధతిని నిర్ణయించుకొనే హక్కు ప్రజ అందరికీ వున్నది" ఈ ప్రకటన నెఱవేర్చి తీరుతామని నమ్మకం కల్గించవలెను.

3. ప్రజలకు ప్రజాస్వామ్య హక్కులు లేకపోతే నిజమైన యుద్ధ సమీకరణ జరుగదు.

ప్రజల సంగ్రామశక్తిని మరింత ప్రజ్వలింప చేసేందుకు సమస్త ప్రజల ఆర్థికస్థితిని చక్కబరుస్తామనే పూచీ నివ్వడం ప్రధానావసరం.

(వ్రాకేచీఙ న్యూచైనా డైయిలీ 25—1—42.)

కానీ అధికారవర్గ మేమాత్రం తమ పాత పద్ధతిని వదలుకోలేదు.

ప్రపంచములోని అన్నిదేశాల వలస ప్రజలూ సమగ్ర స్వతంత్రశక్తి ప్రతినిధులు. వారే ఫాసిజానికీ పీడనకూ హింసకూ సహజ విరోధులు — వారి ప్రయత్నాల నర్థంచేసుకొని ప్రపంచ పాలన కెక్కపెట్టిన పాసిస్టులతోటి పోరాటంలో వారి సంపూర్ణ మైత్రిశి సంతరించుకో వలసింది ప్రజా ప్రభుత్వాల్లోని ప్రజల కర్తవ్యం.

వలస రాజ్యాలు-దక్షిణ ఫసిఫిక్ ప్రాంతంలోనే - 44000000 చదరపు కిలోమీటర్లు, జనసంఖ్య నన్నూరుకోట్లు. బ్రహ్మాండమైన బలగాన్నిట్లా వారెంత ఫాసిస్టు విరోధు

లైనా యీ మహాసంగ్రామంలో విరోధులతో పోరాడే సంపూర్ణావకాశాన్ని నిరోధించే అభ్యుదయ భంజక దృక్పథం తొలగిపోవాలి. వలస రాజ్యాలు పరిపూర్ణంగా సమీకరింపబడాలి

ఏమైనా :

ఫాసిజం వలస రాజ్య ప్రజల సంగ్రామాదర్శాలకు పరిపూర్ణంగా శత్రువు. దాన్ని విధ్వంసం చేసేందుకు వారు హృదయ పూర్వకంగా ఆకాంక్షిస్తున్నారు.

ఫాసిజం వలసపాలనను మరింత నికృష్టం చేస్తుంది. నీచమైన జాత్యహంకారంతో రంగు జాతులను పరాధ విస్తుంది. స్వతంత్రమనే దేవిధంగానూ లేకుండాచేసి పశుప్రాయులనుగా చూస్తుంది.

అందుకనే ఫాసిజమంటే వలస ప్రజలకు గిట్టదు.

---

# ఫాసిజం : ఇండియా

---

"అక్షరాజ్యాల నెనరు మాటలకు నేనెన్నడూ యేకీభవించం. ప్రాముఖ్యాన్ని గానీ ప్రాబల్యాన్ని కానీ యివ్వలేదు. వాళ్ళు భారత దేశానికి వస్తే స్వతంత్రాన్నిచ్చే వారుగా కాక కొల్ల గొట్టి దాన్ని పంచుకొనేందుకే వస్తారు."

(గాంధీజీ 21–6–42.)

"మనం జపానుకుగానీ జర్మనీకిగానీ బానిసలం కాదలం పము. మనలను బానిసలు చేయాలనే యే జాతికైనా విరుద్ధంగా పోరాడుతాము. దేశాలను స్వతంత్రం చేయడానికీ, ఇండియాకు స్వతంత్ర మివ్వడానికనికూడా తాము పోరుతున్నామని జర్మన్ జపాన్ రేడియోలు దినమూ ప్రకటిస్తూంటాయి. అందులో నాకు విశ్వాసం లేదు. యీ ప్రకటనలతో మనం మోసపోరాదు. మనం మన దేశాన్ని రక్షించుకోనేందుకు సిద్ధంగా వున్నాము మనం సంఘటితమైతే జపానుకుకానీ జర్మనీకిగానీ భయపడ నవసరం లేదు. మన ఆఖరు రక్తకణం వఱకూ మాతృదేశ గౌరవ బహుమతులను కాపాడడానికై యుద్ధం చేస్తాము."

(నెహ్రూ 30-6-42.)

ఫాసిజం తలయెత్తినప్పటినుంచీ భారత జాతీయోద్యమం దాన్ని బద్ధ శత్రువుగా చూస్తున్నది. తన అసహ్యాతనూ ద్వేషాన్నీ వెలిబుచ్చు తున్నది. భారతజాతికి సామ్రాజ్యతత్త్వ పాలనమంటే యేమిటో అనుభవముంది. అందుకనే ప్రపంచంలో యేనాడీ ఫాసిస్టు దురాక్రమణ ప్రారంభమైందో ఆనాడే జాతీయ భావస్వరూపమైన కాంగ్రెస్సు తన అభిప్రాయాలను విస్పష్టంగా ప్రకటించింది. జపాను హఠాత్తుగా చైనామీద విఱుచుక పడినప్పుడు తీవ్ర అసమ్మతిని వెల్లడించింది. అక్కడి బాధాదూన ప్రజానీకానికి తన సానుభూతిని సహకారాన్నీ ప్రకటించింది. ప్రజలకు సాయం చేయడానికి వైద్యసమితిని పంపింది. ఆయుద్ధంలో ఒక వైద్య శేఖరుడుకూడా తన పనిని నెఱవేరుస్తూ చనిపోయినాడు.

స్పెయినులో విద్రోహక చర్యలను ఖండించి అందుకెంత ఫాసిస్టు ప్రోద్బలమున్నదో విమర్శించి, ఆనాడే ఫాసిజం

ప్రపంచ ప్రజాస్వతంత్ర నాశకమని చెప్పింది. నెహ్రూ స్వయంగా స్పెయినుకు వెళ్ళి 'స్పెయినులో మన యుద్ధం జరుగుతూ వుందన్నాడు. మన స్వతంత్రంకూడా ఫాసిస్టు విరుద్ధ యుద్ధంలో సమ్మిళితమైన దన్నమాట. అప్పటి కాంగ్రెసు తీర్మానాలూ నెహ్రూ ప్రకటనలూ జంకూ గొంకూ లేకుండా ఫాసిజంగుట్టు బయటపెట్టినవి.

ఆ తర్వాత బ్రిటీషు పాలకవర్గ మవలంబిస్తూండిన 'అప్పీజు మెంటు పాలసీ'ని నిరాఘాటంగా ఎదిర్చి ఫాసిజంతో రాజీ ఆత్మవినాశకరమని చెప్పింది. జెకోస్లోవేకియా విచ్ఛిన్న మైనప్పుడు నెహ్రూ, ఫ్రాన్సు బ్రిటనులు కాళ్ళూ చేతు లాడించకుండా పట్టుకొని వుంటే ఫాసిజం జకోస్లోవేకియాను మానభంగంచేసిం దన్నాడు. అల్లే వరుసగా ఒకొక్క దేశాన్ని ఫాసిజం వాతవేసుకున్నప్పుడెల్లా తన అభిప్రాయాల నెప్పటి కప్పుడే జాతీయవాదులూ జాతీయ సంస్థా వెల్లడి చేసింది.

ఫాసిజం సంగతి యెఱుగుదుము గనుకనే వారి ఘోర ఘాతుక కృత్యాలు మనం దినదినమూ ఖండించినాము. ఫాసి జం నిర్మూలించ దలంచినాము.

దాన్నణచడమంటే: ప్రపంచ స్వతంత్రతా జ్యోతినీ తద్వారా మన స్వతంత్రాన్నీ రాబట్టుకోవడం, కాపాడుకోవడం, అందుకు దేశీయ శక్తులను కూడగట్టుకొని రావలెను. ప్రజా దృక్పథాన్ని మార్చవలెను. దేశంలోని సర్వసంపదలనూ అందుకు సన్నద్ధం చెయ్యవలెను.

కాబట్టే యీ ప్రజా సమీకరణ సక్రమంగా జరిగేందుకు జాతీయ ప్రభుత్వ స్థాపనం అత్యవసరమని జాతీయవాదులే కాక ప్రతి భారతీయుడూ అర్థం చేసుకున్నాడు. జాతీయ

అంతర్జాతీయ వాదులైన విదేశాలలోని స్వతంత్ర ప్రియులందరూ అంగీకరించినారు. ముందటి అధ్యాయంలో వివరించినట్లుగా వలస ప్రజలు సమీకరణం కావడం ముఖ్య యుద్ధతంత్ర సమస్య. ప్రజాసహకారం బానిసలుగానే పొందటం కష్టం; పైగా పరిమితంకూడా.

"ఇండియా ప్రజల స్వచ్ఛంద సంపూర్ణ సహకారాన్ని సంపాదించడంలో, ప్రపంచ మిత్ర మండలిలో కల్లా బ్రిటను కొక ప్రత్యేక బాధ్యత ఉన్నది.

... ... ... ...

భారత ప్రజలూ, వలస ప్రజలూ ప్రజాస్వామిక – ఫాసిస్టు విరుద్ధశక్తి కొక బ్రహ్మాండ నిధిగా వున్నారు. వారి మనుష్యబల మపారము. యుద్ధానికి కావలసిన ముడిసరుకుల్లో వారికున్న ఆధారాలు లెక్కలేనన్ని. వారి జాతీయ ఉద్యమాల్లో ప్రదర్శితములైన ప్రజాశక్తీ త్యాగదీక్షా ఏకైక యుద్ధముఖంలో ఏకైక విజయంలో బలవత్తరంగా పనిచేయగలవు. అదృష్ట నిర్ణేతలు కాగలవు.

అయినప్పటికీ, యీ వస్తుసంపద గానీ, యీ మనుష్యబలం కానీ యింత వఱకూ పూర్తిగా సమీకృతం కాలేదు. వారి ప్రజాస్వామ్య సంకల్పం నిరుద్ధమైంది. నిరుత్సాహపరుప బడింది. ఇండియాలో యింతవఱకూ చేర్చిన సైన్యం పదిలక్షలే – మొత్తం దాదాపు నలభైకోట్ల జనంలో. సేనా సంకలన పద్ధతి మరీ సంకుచితం. "మనుషులేం తక్కువలేరు. యుద్ధ ప్రారంభంనుంచీ దేశంలోని రిక్రూటింగు ఆఫీసులన్నీ వివిధ వర్గ కుల వృత్తులనుండీ వచ్చిన వాలంటీర్లతో క్రిక్కిరిసి పోతున్నవి. ఇంక కొన్నాళ్ళల్లోనే వారి సంఖ్య అసాధ్యంగామించి పొర్ల్యేట్టుంది."

(యుద్ధంలో ఇండియా గవర్నమెంటు రిపోర్టు 1941).

మనుష్య బలంలో సోవియట్ యూనియన్ సాయుధ దళానికి రెండింతలు చేకూర్చగలదు. కనడావారి సేనా సంకలన పైఖరిలో నూటాయాభై నుండీ యిన్నూరు లక్షల వరకూ చేర్చగలదు. ఇంతవరకూచేర్చిందెంతంటే జనాభాలో 0.25%. అంటే నన్నూరుమంది కొకడు. మొత్తంమీద యూరోపులోని ఏ అప్రధాన రాజ్యంకన్నా తక్కువే. ప్రజా సైన్యశిక్షణ నివ్వడానికి ఆయుధాలుచాలవు. అందుకనిమొన్న మొన్నటి వరకూ సైనికుల చేర్చడం కొంత తగ్గింప బడింది." (అబ్జర్వర్ సైనికశాఖా విలేఖరి మార్చి 8, 1942) చాంగ్ చాంని సాధనాలతోనే సేనలను సంఘటిత పరచడానికీ, శిక్షణ నివ్వడానికీ, జపాను సేన నెదుర్కొనేవిగా చేయడానికీ, జాతీయ నాయకత్వం కింద వీలవుతుందని చైనా తెలియ జేసింది. కానీ శిక్షణ సమస్యా పరిష్కారంలో తోడ్పడేందుకు, వలయుచో సైనికోపాధ్యాయులను ఇండియాకు పంపుతానని చైనాసేనాపతంటే యింత వరకూ ఒప్పుకోలేదు.

వస్తుసంపత్తీ యుద్ధోత్పత్తి విషయాల్లోనూ అంతే. యుద్ధోత్పత్తి కవసరమైన ముఖ్య — ముడిసరకులకు — ఆధారాలు కావలసినన్ని ఇండియాలో ఉన్నవి - కానీ ఏ కొంచెమో ఉపయోగింపబడు తూన్నవి. 260000 లక్షల టన్నుల బొగ్గు రిజర్వులతో యుద్ధానికి ముందు సాలుసరి ఉత్పత్తి 250 లక్షల టన్నులు — బ్రిటీషు ఉత్పత్తిలో 1/10 భాగం — పెరిగింది. మరి 1940లో బొగ్గు ఉత్పత్తి పడిపోయింది. 30000 లక్షల టన్నుల యినుము గనుల రిజర్వులతో యుద్ధ ప్రారంభములో 10 లక్షల టన్నులైనా ఉక్కు ఉత్పత్తి కాలేదు. బ్రిటీషు ఉత్పత్తిలో 1/13 వంతూ పోలెండు ఉత్పత్తికన్నా తక్కువా. 1941

కంతా ఉక్కు ఉత్పత్తి 12½ లక్షల టన్నులకు పెరిగింది. "ఇంకా కొంత పెంచివుండొచ్చు. కానీ ... ఇండియా నుండి ముడి యినుము మనం (బ్రిటన్) చాలా దిగుమతి చేసుకొంటున్నాము. అట్లా పెంచడమంటే ఇక్కడ మన (బ్రిటిష్) పరిశ్రమల కత్యవసరమైన ముడి యినుమును యిండియాలోనే ఖర్చుపెట్టడ మవుతుంది." (డీవాంషీర్ ప్రభువు — ఇండియా అండర్ సెక్రిటరీ. ప్రభువుల సభలో 2–2–1942) ఇట్లా ఇండియాలోనే ఉక్కు తయారు చేయకుండా అక్కడినుండీ ముడియినుము దిగుమతి చేయడానికీ మరీ తయారైన ఉక్కును వెనక్కు పంపడానికీ, బ్రిటనుకూ దూర ప్రాచ్యానికీ యుద్ధ సరఫరాకు తక్షణావసరాలైన నౌకలను ఉపయోగిస్తున్నారు. మోటారు పరిశ్రమ కానీ విమానపరిశ్రమ కానీ లేదు, ఘనయంత్రాలన్నిటికీ యిండియా విదేశ సరఫరామీదే ఆధారపడి ఉంది:

ఇప్పటికైనా పరిశ్రమాభివృద్ధి జరిగితే యిండియా దూర ప్రాచ్య యుద్ధనిధిగా పనిచేయగలదు. మోటారు యింజన్లను ఇండియాలో తయారు చేయడం 'ఈ యుద్ధానికి సంబంధించినంత వరకూ సాధ్యమయ్యే ప్రణాళిక కా'దని ప్రభుత్వం కామన్సుసభలో అక్టోబరు 9, 1941 తేదీ ప్రకటించింది. తిరిగీ 1942 వసంతంలో రెండున్నరేండ్లు యుద్ధం జరిగిం తర్వాత 'మోటారు ఇంజన్ల భాగాలూ, లేక పూర్తి ఇంజన్లూ ఉత్పత్తిచేసే సమస్యను పరిశీలించడాని' కొక పరిశీలక సంఘాన్ని యేర్పఱచినట్లు ప్రకటించింది యుద్ధ ప్రారంభం నుండీ ఆధినివేశాల్లో జరుగుతూన్న బ్రహ్మాండ పరిశ్రమాభివృద్ధి వెనకపడిపోయిందని భారత పారిశ్రామికులు గొంతుచించుకుంటున్నారు. "గత యుద్ధంలాగా కాదు.

చాలా తక్కువగా పరిశ్రమ లీతూరి పెరిగినవి.” (గ్రేట్ బ్రిటన్ అండ్ ఈస్టు — జూన్ 19, 1941).

ఇక్లే యుద్ధోత్పత్తికి లభించే బ్రిహ్మాండ మనుష్యబలం ఏదో కొంత ఉపయోగింప బడింది. పారిశ్రామికోత్పత్తికి కావలసిన ముడిసరుకులకు తరగని ఆధారాలున్నా, అనంత మానవశక్తి నిధానాలున్నా, రెండున్నర శతాబ్దులు బ్రిటీషు పాలన యిండియాలో జరిగినా, ఈనాటికీ జనాభాలో నూటి కొక్కడుకూడా ఫ్యాక్టరీల్లో కానీ, గనుల్లో కానీ, రైల్వేలలో కానీ, రేవులలో కానీ నియమింప బడలేదు. నవంబరు 1941 నాటికి, గవర్నమెంటు ఆర్డినెన్సు ఫ్యాక్టరీలలో 50000 మంది కార్మికులు పనిచేస్తున్నారని ఘనంగా చెప్పుకున్నారు. అంటే జనాభాలో 8000 మంది కొక్కడు చొప్పున. 1941 ఆఖరుకు భారత కార్మికులు రెండు జట్లు— జట్టుకు యాభై మంది — పరిశ్రమలలో తరబీతు పొందడానికి బ్రిటనుకు వెళ్ళినారు, నలభై కోట్లు జనాభాకు. ఇంతలో ఇంగ్లండులోనేమో మనుష్య సంఖ్యా సమస్యనుగూర్చి అధికారులు చేతులు నలుపుకుం టూంటారు.

భారత పరిశ్రమాభివృద్ధి నరికట్టే విధానం, శాంతి సమయంలోనే భారత ప్రజాభ్యుదయ — అవసరాలకు విరుద్ధం కాబట్టి యిప్పటికే దుర్భరంగా వుంది. నేడో ప్రపంచ సంఘటనా ప్రధానావసరాలకు యెదురు చుక్కై ఘోరతమ కృత్య మవుతుంది; ఫాసిజానికి ప్రత్యక్ష దోహద ప్రాయ మవుతుంది.

వీటన్నిటి వెనకా వలసపాలనా విధాన సర్వస్వం పలుకుబడి వున్నది. జాతీయ స్వయం నిర్ణయ సూత్రానికి నాస్తి చెప్పడం, కడకు తాత్కాలికంగా వలస రాజ్యాలు

ఫాసిస్టుల వాతపడేట్టున్నా అప్రజల కోరికలకేమీ లొంగ కూడదనుకోవడం, వేగంగా వలసప్రజలు ముందు కొస్తూంటే ఆదుర్దాపడడం, ప్రజలను సాయుధులనుచేయడానికి జంకడం, వారెట్లాగో స్వతంత్రంవైపు సాగిపో చూస్తూంటే బెదరిపోవడం, ఇవన్నీ ఆ లక్షణాలే.

ఈ విధానంవల్ల కలిగే నష్టపరంపర, మలయా, సింగపూరు, జావా బర్మాలవల్ల తెలుసుకొన్నాము అక్కడ జపాను దురాక్రమణకారులు ఊడ్చుకొని పోగలిగినారు. అక్కడి ప్రభుత్వము లండన్ టైమ్సుపత్రిక మలయా రిపోర్టు మాటల్లో 'జన జీవితంలో పాదుకొనలేదు.'

ఇండియా యితర వలసరాజ్యాల విధానంలో పూర్తిగా మార్పు వచ్చితీరవలెను. పూర్వ మీ ఉబుసే కాబట్టని కొందరి కీదూరప్రాచ్య సంఘటనలు దిగ్భ్రమ కల్గించి మేల్కొల్పినది.

అయినా అట్టి మార్పు తేవడానికి అవసరమైన సన్నాహం లింకా చేయవలసిఉన్నవి.

"తా మేప్రభుత్వం కింద వుండాలో ఆ ప్రభుత్వపద్ధతిని నిర్ణయించుకొనే హక్కు సమస్త ప్రజలకూ వున్నది' అని అట్లాంటిక్ చార్టరు శెల్లడించింది. "శ్వేతజాతులవలెనే రంగుజాతుల ప్రజలూ చర్చిల్ రూజ్వెల్టుల అట్లాంటిక్కు చార్టరు ఫలితా లనుభవిస్తారు" అని అట్లీగారు దీని ప్రకటనానంతరం పడమటి అఫ్రికా విద్యార్థులకు స్పష్టీకరించినట్లుగా 'డైలీహెరాల్డు' ఆగష్టు 16, 1941 ప్రచురించింది. ఆ తర్వాత ప్రత్యేకించి 'ఇండియా బర్మా లేక యింకే బ్రిటీషు సామ్రాజ్య భాగంకానీ" అట్లాంటిక్కు చార్టరు ఆచరణలోకివచ్చే ప్రదేశాల్లోకి చేరవని వేరుపరుస్తూ 'యూరోపు

రాజ్యాలా ప్రజలా ప్రభుత్వం స్వపరిపాలనం జాతీయజీవనం వీని పునరుద్ధరణమే ముఖ్యంగా మా మనసులో వుండినది'' అని చర్చిల్ గారు సెప్టంబరు 9, 1941 ఉపన్యాసంలో వివరించడం వలన ప్రజాభ్యుదయ కాంక్షను పెంకుంమీద కొట్టడమన్నమాట. బర్మా మలయా సింగపూరులను, ఫిలిఫైన్సుతో పోల్చి చూడొచ్చు. మొదటవి త్వరగా కూలిపోయినవి అంత కన్నా దీర్ఘకాలం ఫిలిఫ్ఫైన్సు ప్రతిఘటించింది. ఫిలిఫైన్సులో చాలామటుకు స్వపరిపాలన మివ్వబడింది. వారికి అధ్యక్షుడూ, మంత్రివర్గమూ జాతీయచట్టసభా వుంది. పైగా 1945 కు సంపూర్ణ స్వతంత్రి మిస్తామని గడువు నిర్ణీతమైంది.

ఆత్మరక్షణా యుద్ధానికి ప్రజల నుద్రిక్తపరచి సన్నద్ధపఱచడంలో జాతీయ స్వతంత్రిత కున్నశక్తిని చైనావీర విహారం నాయకత్వం ప్రదర్శించింది. చైనా వేనకు వేలు ఆటంకాలున్నా చాలినన్ని ఆయుధాలూ మందుసామానూ సంపాదించే ఉత్పత్త్యాధారాలు లేకున్నా, ఐక్యతతో జయప్రదంగా ఆయిదేండ్లు జపాన్ను ప్రతిఘటించ గలిగింది. ఇప్పుడేమో ఇతర ఆశియాజాతుల సహాయార్థం సైనికులను పంపగలుగు తూంది.

స్వతంత్రి చైనా, స్వతంత్రి భారతదేశాల కలయిక తూర్పు ఆశియాలో స్వతంత్రితకూ స్వతంత్రి పోరాటానికీ మూలం కావలెను. భారత ద్వారంగలకూ వచ్చిన జపాను ఉద్ధతి, భారతదేశ స్వతంత్రిరక్షణ సమస్యను ప్రపంచ రాజకీయాలలో ముఖ్యంగా చేసినది. ప్రపంచ విరోధితోడి ఏక యుద్ధంలో సంయుక్త దేశాలతో సమాన భాగస్వాములుగా భారతప్రజలు సహకారం చెయ్యవలెను. ఇందుకై బ్రిటీషు ప్రభుత్వానికీ భారతప్రజా ప్రతినిధులకూ మధ్య అంగీకారం

కుదిరే మార్గం కనిపెట్టడం చాలా ముఖ్యం. దీనికి మార్గమేమిటంటే, ఇప్పటి నిరంకుశ ప్రభుత్వ స్థానంలో జాతీయ సంయుక్త ప్రభుత్వాన్నేర్పరచవలెను. సమానాదర్శానికై సమాగమించగల అన్ని రాజకీయపార్టీల నాయక ప్రతినిధులూ అందులో వుండవలెను. బ్రిటన్ సంయుక్త దేశాలతో యుద్ధ సహకారం చేయడంలో ముఖ్యాంశాలకు లోబడి పరిపూర్ణాధికారం భాధ్యతా వారి కిచ్చివేయవలెను.

"ఈ పునాదిమీద అంగీకారం కుదర్చడానికి ఇండియాకు వెళ్ళిన క్రిప్స్ రాయబారం విఫలం కావడం ఫాసిస్టు విరుద్ధ సంఘటన కో మర్మాఘాతం. అంగీకారం సాధ్యం కాక కాదు క్రిప్స్ రాయబారం విఫలమైంది; మరి, సర్వసమాన యుద్ధానికి భారత ప్రజలను సమీకరించే బాధ్యతాయుత ప్రభుత్వ నిర్మాణమనే ప్రాథమిక వాంఛను తిరస్కరించడం వల్లనే భావి భారత రాజ్యాంగ నిర్మాణానికి సంబంధించిన క్రిప్స యుద్ధానంతర ప్రణాళికమీద యీ వైఫల్యం రాలేదు; ఈ ప్రణాళిక స్వపరిపాలన కెంతో దూరమై కృత్రిమంగానూ, ప్రజాస్వామ్య విరుద్ధంగానూ వుండినది; ఎందుకంటే ప్రజాస్వామ్య ప్రకారం యెన్నుకోబడిన భారత ప్రజాప్రతినిధులు తమ ప్రభుత్వ విధానాన్ని నిర్ణయించుకోవడానికి స్వతంత్రులుగా వుండవలెను. యీ స్వయంనిర్ణయసూత్ర ప్రాథమిక మూలాన్నే త్రోసిపుచ్చినారు. అంతేకాక భావి భారత వైవిధ్యానికి అసాధ్య అభూత కల్పనలతో నిండిన దా ప్రణాళిక. కానీ భారత రాజకీయవేత్త లీయుద్ధానంతర స్థితి గూర్చిన ఊహ లిప్పుడాచరణ కంత ముఖ్యం కావని యధార్థ దృష్టితో చూడగలిగినారు. మత తగాదాలూ భారత ప్రజలలో భేదాలూ అంటారే వానివల్లా యీ రాయబారం చెడిపోలేదు; ఈ సమస్య చర్చలలో రానేలేదు. అతర్వాతనే

యేదో కారణం చెప్పాలని దీన్ని చెప్పారు. "సంభాషణ లో యేదశలో కానీ యే మత అల్పసంఖ్యాక సమస్యయు ఉద యింపలేదు" అని స్పష్టంగా నెహూ్రు ప్రకటించడంవల్ల విధి లేక సర్ స్టాఫోర్డు క్రిప్సుకూడా "వాస్తవమే నేను అల్ప సంఖ్యాక సమస్యను కాంగ్రెసుతో చర్చింపలేదు" అనీ "రాయబార వైఫల్యం జరిగింది మత సమస్యమీద కా"దనీ ఒప్పుకోవలసి వచ్చింది. వివిధ రాజకీయవాదులూ జాతీయ ప్రభుత్వాన్ని వాంఛించినారు. అట్టి ప్రభుత్వమే స్థాపించ వలసివచ్చివుంటే ఇంకా రాయబారాలు జరగవలసినవే. కానీ. ఆ దశకు రానేలేదు ఎందుకంటే: ఆ సూత్రాన్నే అసలు తిరస్కరించారు గనక; అన్ని తెగలూ యీ వాంఛా ప్రకట నలో యేకమైనా అంగీకరిచమని స్పష్టీకృత మైంది. ఇదీ అసలు రాయబార భగ్నానికి కారణం.

"ఇండియాకు జాతీయ ప్రభుత్వ మివ్వడానికి అంగీక రించఃందువల్ల భారతదేశ రాజకీయ పరిస్థితి అధ్వాన్నమైంది. భిన్నాభిప్రాయాలూ భయభ్రాంతులు కలిగినవి. వ్యర్థ శాంతి వాదానికి పలుకుబడి హెచ్చింది. ఉదాసీనతమా యీ చావు బదుకుల పోరాటంలో తటస్థతమా దారితీసింది."

(పామీదత్తు)

ఈ జాతీయ ప్రభుత్వం కత్తిగట్టి ఫాసిజంతో పోరాడు తామని కాంగ్రెసు తీర్మానించింది. ప్రపంచ సంఘటనా బలానికే జాతీయ ప్రభుత్వం అవసరమని స్పష్టీకరించింది. కానీ అధికారవర్గం తిరస్కరించింది. 1942 ఆగష్టు 7వ తేదీ కాంగ్రెసుచేసిన తీర్మానానికై మహాత్ముడు నెహ్రూ ఆజాద్ మొదలగు ఫాసిస్టు విరుద్ధ భారత నాయకు లందరినీ ప్రభుత్వం నిర్బంధించింది. కాంగ్రెసు

సంస్థను నిషేధించింది. పంచమాంగదళం దీన్నుపయోగించుకోవాలని విధ్వంసక చర్యలను కాంగ్రెసు కార్యక్రమంగా ప్రోత్సహించింది. బోసు ముఠా, కాంగ్రెసు సోషలిస్టు పార్టీ, రహస్యంగా జాతీయ సంస్థపేరుతో ప్రచారం సాగించినవి. ప్రభుత్వం తీవ్రచర్యలు గైకొన్నది. దేశం అల్లకల్లోలమైనది. జరిగిన ఘోరాలకూ విద్రోహాలకూ కాల్పులకూ దేశీయ సంపజ్జన నష్టానికీ నిర్బంధాలకూ వేధింపులకూ సాధింపులకూ అంతూ పొంతూ లేదు. హృదయ విదారకంగా జరిగినవి. కమ్యూనిష్టు పార్టీ తన యావచ్ఛక్తినీ ఉపయోగించి విధ్వంసక చర్యలు కాంగ్రెసు కార్యక్రమంకాదని పంచమాంగదళాన్ని బయలు పెట్టింది. ప్రభుత్వ దమన నీతిని ఖండించింది. అక్టోబరుకల్లా యివి తగ్గినవి.

ఫిబ్రవరి 43లో గాంధీజీ నిరశనవ్రతంద్వారా మహాత్ముని లేఖలు ప్రకటింపబడినవి. దీనితో స్పష్టంగా విధ్వంసక చర్యలకూ కాంగ్రెసు కార్యక్రమానికీ సంబంధంలేదని వెల్లడయింది. పంచమాంగదళం వెలుపలుచ బడింది. ముస్లిం ప్రజలలో కాంగ్రెసు లీగ్ ఐక్యతకై ఉబలాటం కలిగింది. దేశభక్తులైన జాతీయవాదులు విధ్వంసక చర్యలనుండీ పూర్తిగా మరలినారు. సప్రూ నాయకత్వం క్రింద దేశంలోని వివిధ పక్షాలూ ప్రముఖులూ డిల్లీలో సమావేశమై— నాయకులను వదలవలెననీ జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించవలెననీ ఏకకంఠంతో వాంఛించినారు.

మలిగోకతూరి ఫాసిజానికి భారతశక్తి విరుద్ధమని ప్రపంచానికి వెల్లడయింది.

ఈ పరిస్థితి వెంటనే మారవలెను. ఇందులో బాధ్యత బ్రిటీషు ప్రజా సామ్రాజ్యాభిప్రాయంమీద చాలా వుంది

జాతీయ నాయకులను వదలి వెంటనే జాతీయ ప్రభుత్వ స్థాపన చేసి ప్రజా సంఘటనను బలపరిచేటట్టు చూడవలెను.

ఇండియా మొదటినుండీ ఫాసిజాన్ని శత్రువుగా చూస్తున్నది. కానీ అధికారవర్గ సంకుచితదృష్టి స్వార్థపరత్వాలవల్ల తన అమేయ శక్తిసంపదలను ఫాసిస్టు విధ్వంసనానికై కూడ గట్టుకొనలేక పోతున్నది. అయినా భారత ప్రజానీకం ఫాసిస్టు విరుద్ధ సంఘటనలో చేరి, దానిని తుత్తునియలు చేయడానికి ఆతురత చూపుతున్నారు. వారిని సమీకరించే బాధ్యత అటు బ్రిటీషు అధికారవర్గ దృక్పథంమీదనే కాదు మనమీదకూడా ఉన్నది "ఈ పోరాటం ఈ ప్రపంచ మంతటా వివిధ ప్రజా జాతుల సంపూర్ణ స్వతంత్రానికవసరమైన పరిస్థితులను సమకూర్చవలెను.

---

# ఫాసిజం: మన బాధ్యత

---

ఫాసిజం వినాశదశ సమీపించినదే కానీ పూర్తి కాలేదు. బలం సన్నగిల్లినదే కానీ పతనం కాలేదు. విఘాతమైనదే కానీ నిర్ఘాతం కాలేదు. జపాన్ ఫాసిస్టు దురాక్రమణ భయం మన కింకా తొలగిపోలేదు. యిప్పుడున్న క్లిష్ట పరిస్థితులను తొలగించకున్నందుకూ పరాజయ పరాభవంతో నిస్పృహ చెందిన సేనావారాన్నీ తమ దేశ

ప్రజలనూ కొంత ప్రాద్బలం కలిగించి సంక్షోభాన్ని వాయిదా వేసేందుకూ యేదో ఒకటి చేసి చూపించాలనే ఆతురతతో పిచ్చివాడులా జపాన్ మనదేశంమీద పడ వచ్చును. మిత్రమండలి తొలిదెబ్బ తీయకముందే తానే పైబడడం స్వరక్షణమని వారు తలపవచ్చును. జపాన్ బల మేమీ తక్కువయ్యేంత దెబ్బతినలేదు, తనకు యూరోపులో కొంత వూపిరి తిప్పుకొనేందుకు కూడా జపాను దాడిని హిట్లరు బలవంతపెట్టి చేయించవచ్చును.

జపాన్ మన పంచలనే ఉన్నది. సరిహద్దులో పొంచి కూచున్నది. మన నేలపై అగ్నిగోళాల నప్పుడప్పుడూ విసురుతూనే ఉన్నది. విపరీతమైన అభూతకల్పనలతో ప్రజల నువ్విళ్ళూరిస్తున్నది. బర్మాకు స్వతంత్ర మిచ్చినామని అసత్య ప్రచారం చేస్తున్నది. సేనా నివహాలను మన పరిసరాలలో ఉంచుతూ సన్నద్ధం చేస్తూనే ఉన్నది.

మన దేశంలోని రాజకీయ ప్రతిష్ఠంభనాన్ని మంచి అను నుగా అది తీసుకోవడానికీ వీలున్నది. అందునుగూర్చి బిస పెట్టుతున్నది. పంచమాంగదళాన్ని పెంచుతున్నది. దేశ ద్రోహిగా పరిణమించిన సుభాషచంద్రబోసు సింగపూరులో స్థావరమేర్పఱమకొన్నట్లు వింటున్నాము. స్వతంత్ర భారత సేనను కూర్చుతున్నానని వాగుతున్నట్లూ తెలుసుకొం టున్నాము. జపాను ఫాసిస్టు లీయనను బహుబాగా ఉప యోగించుకొంటున్నారు.

పై పరిస్థితులన్నిటినీ గమనిస్తే మనకు తోచే మొదటి సంగతి : ఫాసిజం భయం మనకు పూర్తిగా వదలలేదు ; యెన్నాళ్ళీ ఫాసిష్టుసేన బర్మాలో ఉంటుందో, యెన్నాళ్ళీ రాజకీయ ప్రతిష్టంబన మనదేశంలో ఉంటుందో అంతవఱకూ జపాను దురాక్రమణ భయం మనకుండనే ఉన్నది.

కేవలం సైన్య సమీకరణతో రక్షణ జరుగుతుం దనుకోవడం సామ్రాజ్యవాదుల దృష్టి. యీనా డీ ఫాసిస్టు దురాక్రమణను ధిక్కరించేశక్తి ప్రజా సమీకరణంతోనే పరిపూర్తి కాగలదు. ఈ భయ మున్నన్నినాళ్లూ దేశ రక్షణావశ్యకతను మనం తీవ్రంగా గుర్తించవలెను.

దేశంమీద దాడి జరిగితే బాధపడేవారు మన ప్రజలు. మన సోదరీ సోదరులు, మన పిల్లాజెల్లా, మన తల్లీ తండ్రీ. పాలక వర్గానికి కాదు రక్షణ ప్రాముఖ్యం; మనకు. సామ్రాజ్యవాదులకు దేశం ఫాసిస్టుల బారిపడడం దొరకిపోవడం కేవలం తమ ఆస్తి పోయినట్లు మాత్రమే. మనకు సర్వస్వ వినాశం ఫాసిజం మహాఘోర దురహంకార సామ్రాజ్యవాదంగా తెలుసుకొని పోరాడవలసినది మనం. జపాను దురాక్రమణ భయమున్నంతకాలమూ మనం రక్షణను ప్రధాన విధిగా భావించి తీరవలెను. ఈ అవసరాన్ని ప్రతి జాతీయవాదీ దేశభక్తుడూ గమనించితీరవలెను.

పంచమాంగదళం జాతీయవాదుల ద్వేషాన్ని ఆధారంగా చేసుకొని దేశాన్ని దారుణంగా గందరగోళ పఱచినది. కానీ యిప్పుడు దాని ఆటలు సాగలేదు. బాపూజీ జాబుల మూలంగా వీరి గుట్టు బయటపడినది. విధ్వంసక చర్యలను ప్రోత్సహించినవారికిక ఆస్కారం జాతీయవాదు లివ్వడం లేదు. దేశభక్తులు విధ్వంసక చర్యలను మానుకున్నారు. ఎంత తీవ్రంగా పంచమాంగదళం పనిచేసినా ప్రజలెవ్వరూ చెవియొగ్గరు. శాంతిబద్ధమైన సత్యాగ్రహ పద్ధతి నే ముసుగుతో జాతీయవాదుల నందులోని కీడ్పుకొనదలచి కూడా అదివిఫలమైనది. ముఖ్యమైన దేమంటే పంచమాంగదళాని కింక ప్రజల్లో — జాతీయవాదుల్లో — పలుకుబడిలేదు. వంచనకు మార్గంలేదు. దేశరక్షణ భంగానికి దేశభక్తు లెన్నడూ ఒప్పుకోరు.

బయటనున్న కాంగ్రెసు వాది యీ ప్రతిష్టంభనం తొలగి పొయ్యే దారి లేదనుకుంటున్నాడు నాయకులు నిర్బంధంలో నున్నారు. ప్రభుత్వం దమన నీతితో సంతృప్తిపడుతున్నది. ఇంక యిదెట్లా తొలగి పోతుందా అనే డోలాయమాన మానసంలో దిక్కు తోచడంలేదు. విధ్వంసక చర్యలూ ప్రభుత్వ ధిక్కారణమూ చెడ్డవని గ్రహించి వదులుకొన్నాడు. కానీ నిస్పృహా అశాంతి కింకర్తవ్యతా విమోహమూ అతన్నావరించి కలత పెడుతున్నవి. కడకింకింతే దానంతటదే వదలవలెననీ, ప్రభుత్వ దృక్పథం మారేటటూ వీలులేదనీ విసుగుతో పూరుకుంటున్నాడు. ఫాసిజం విధ్వంసనం తనవిధిగా భావిస్తున్నాడు కానీ అందుకు పరిస్థితు లనువుగాలేవు గనకా ప్రభుత్వం వైముఖ్యంతో తిరస్కరించి పరాభవిస్తున్నది గనకా తన బాధ్యత తీరిపోయినట్లు యోచించుకొంటున్నాడు జాతీయ ప్రభుత్వం లేదుగనక దేశరక్షణ తనది కాదనుకుంటున్నాడు. నిజానికి జాతీయ ప్రభుత్వంలేదు కాబట్టే మన బాధ్యత మరింత హెచ్చు. అధికారవర్గం చేసే రక్షణా ప్రయత్నాలు మాత్రమే చాలవు. ప్రజలను ధైర్య సాహసాలతో నింపలేవు. భీతావహాన్ని తొలగించలేవు. దేశ ప్రజా సమీకరణకు ప్రభుత్వం అసమర్థమని బర్మా మలయాలలో ఋజువు చేసుకున్నది.

ముస్లింలీగు కేవలం ఐక్యతకు తాను సిద్ధమని చెబుతూ అందుకు కాంగ్రెసువారు తను పాకిస్తాను నొప్పుకోవాలంటూ మాత్రమే తన బాధ్యత తీరింపనుకుంటున్నది. ఐక్యతకు ప్రధాన కారణమైన నాయకుల విముక్తికై పనిచేయడం అవసరమని బాగా గుర్తించడం లేదు. తమ స్వయం నిర్ణయ సూత్రం ప్రభుత్వ మిచ్చేది కాదనీ ప్రజలు గుర్తించవలసిందనీ అందుకు జాతీయైక్యతా జాతీయ ప్రభుత్వమూ అత్యావసరము

లని తెలుసుకోలేదు. కానీ ముస్లిం ప్రజాసామాన్యంలో ముస్లింలీగు వర్గాలలో కాంగ్రెసు లీగు ఐక్యతకై ఉబలాటం పెరుగుతున్నది. ఎందఱో ముస్లింలీగులోని ముఖ్యులు లీ ఐక్యత అత్యవసరమనీ తామందుకు సంసిద్ధులమనీ వెలనాడుతున్నారు. రానురానూ యీవాంఛ పెంపొందే సూచనలు నానాటికీ పెరుగుతున్నవి.

కమ్యూనిస్టులు దేశరక్షణావశ్యకతను గుర్తించినారు. ఆహార సమస్యాది తక్షణ ప్రజావసరాలమీద ఐక్యతను నిర్మించడానికి పాటుబడుతున్నారు. ప్రజాసామాన్యంలో ఐక్యతను నిర్మిస్తూ వస్తున్నారు. కానీ అటు కాంగ్రెసువాదులనూ యిటు ముస్లింలీగర్లనూ పూర్తిగా ఒప్పించేంత బలం వీరికింకా లేదు. ముస్లిం ప్రజాసామాన్యంలో తగినంత ప్రచారమింకా జరగలేదు. ప్రజా సమీకరణకు చేస్తున్న కార్యక్రమం రానురానూ అశేషజనాన్నాకర్షిస్తున్నా, కావలసినంత శక్తిసంపన్నత పూర్తిగా యింకాకల్గలేదు. అయినా ఐక్యతా నిర్మాణం పంచమాంగదళం వేలుచేయుడం నిస్పృహను తొలగించడం అనేమార్గాల్లో వీరికృషి ఫలవంతమౌతూ వౌతూవస్తున్నది.

ప్రభుత్వం జాతీయైక్యతకు జాతీయ రక్షణానికై చేసే ప్రజా సమీకరణకు అడ్డంకులు కల్పిస్తున్నది. అభ్యుదయ నిరోధక దృక్పథాన్నే పట్టుకొని వేలాడుతున్నది. ఫాసిస్టు విరోధులను బందిఖానాలనుండీ వదలకున్నది. కడకు వారి అభిప్రాయాలు బయటపెట్టుటకు వెనుకంజ వేస్తున్నది. కానీ భారత జాతీయువాదులు ఫాసిస్టుల కనుకూలురని ప్రపంచాన్ని నమ్మించలేకపోయింది. దమన నీతితో ప్రజల ఆత్మ

ప్రీనీ స్వతంత్ర వాంఛనూ తుడిచిపెట్టలేమని గ్రహించింది. ఇంతైనా అధికారవాంఛా స్వార్థపరతా వాస్తవ పరిస్థితుల కనుగుణ్యంగా ప్రవర్తించనీక గుడ్డిగా నడిచిపోతున్నది.

ఇంక దేశంలో ఆహారసమస్య అతి తీవ్రతర స్థితికి వచ్చినది. పూటకు గంజి దొరకక వీధుల్లో దిక్కులేక పడుతున్న కళేబరాలు; కాటికివేసే గతిలేక కంపుకొడుతున్న పీనుగ పెంటలు, అలూ పిల్లా అనే మమతపోయి విచ్ఛిన్నమైపోతూన్న కుటుంబాలు; అలసి సొలసి ఆకలికిమాడి అమ్మా అని అరిచి చస్తూన్న అమాయిక బాలబాలికలు; వంగ ప్రజలను మాడ్చి వేస్తున్నది.

రాయలసీమలోని నిరుపేద కంటిసోనలు గంటెడు నీరు తేలేకున్నవి. లక్షలమంది రాళ్ళుకొడుతూ గంజి కలమటించి పోతున్నారు. తిండికి గింజలు పుట్టవు. పొట్ట గడవదు. పంటలేదు. ఆవాడిపోతూన్న మొగాలనూ కన్నుకంటిన కడుపులనూచూచి ఓర్చుకొనులేక కష్టమైపోతున్నది.

ఏ పట్టణంలోనూ ఏ పల్లెలోనూ ఆహార సమస్య క్లిష్టాత్ క్లిష్టతరమై ప్రజలను గగ్గోలు పెట్టుతున్నది. అస్థిరక అరాచకం ప్రబలు తున్నది. అనాథ ప్రజానీకం అండలేనిదై అల్లాడు తున్నది. పరిష్కరించే నాథులు లేకపోతున్నారు.

ఎక్కడచూచినా నిరాశ నిస్పృహా నిస్సహాయత జుగుప్స ఉదాసీనత ఆవేదన అసహ్యం తాండవిస్తున్నవి. ప్రజలెన్నాళ్ళు యీ ఘోర దుర్భర క్లేశాల నోర్చుకో గలరు? ఎన్నాళ్ళీ అలజడి అటలాడు తుంది?

ఈ ఆహారసమస్య మరీ కొంత దేశంలో అల్లరులకూ అనాహుతాలకూ దోపిళ్ళకూ కారణం కావచ్చు. యీ పరిస్థితుల్లో ఆదే వచ్చెనా యింక జపాను ఫాసిస్టుల కనులు చల్లబడి

నాలుకపై నీళ్ళూరక మానవు. అది మనకు తప్పక ముప్పు కాగలదు.

ఈ దైన్యాన్ని తొలగించుకొనే మార్గమేది? ఇందులో మన బాధ్యత లేదా? కేవలం అధికారవర్గ దృక్పథాన్ని ఖండిస్తూ అది మా లోపం అంటూ చేతులు కట్టుకొని కూర్చుండవలసిన దేనా? మన కర్తవ్యాన్ని నిర్ణయించుకునే భారం మనదే.

యీ సంక్షోభాన్ని తొలగించుకొనేందుకు జాతీయైక్యతే మార్గం. చైనా మనకు ఆదర్శంగా నిలబడి చూపుతున్నది. జాతీయ శక్తులన్నీ యేకం కావాలి. ఐక్యతా మూలకంగా బలం చేకూర్చుకోవాలి.

మన దేశంలో జాతీయైక్యతకు పునాది కాంగ్రెసు ముస్లింలీగు ఐక్యత కాగలదు దేశంలో ప్రధాన రాజకీయ సంస్థలివి. భారత జాతీయ స్వతంత్రవాంఛ కాంగ్రెసు రూపంతో కనబడు తున్నది. దాని పలుకుబడి ప్రజల్లో అవిచాల్యం అనంతం అమేయం. అట్టి ప్రజాసంస్థే ప్రజారక్షణ ముఖ్యమని ముందుగా గుర్తించాలి. యీనాటి ఆహార సమస్యా పరిష్కారం, అధికోత్పత్తి, దేశరక్షణ చేయగలశక్తి సామర్థ్యాలూ, ఫాసిస్టు విద్వేషమూ, ప్రపంచ స్వతంత్ర ప్రజారాజ్య అభిమానమూ. సోవియట్ చైనాలపై ప్రేమా గల యీసంస్థ ప్రజైక్యతకు పాటుబడాలి. అందుకు నాయకులు బయటలేనిది నిజం. కానీ ఉన్నవారిమీద బరువు లేకపోలేదు. ముస్లింలు కోరుతున్న జాతీయ స్వయంనిర్ణయ సూత్రాన్ని గుర్తించవలెను. అది ప్రతి ప్రజావాదీ అంగీకరించిన విషయము. సోవియట్ యూనియన్ లోని వివిధ జాతుల సమస్య ఆ సూత్రం మీదనే ఆధారపడి చక్కగా పరిష్కరింపబడినది. ఆ సూత్రాంగీకారం ద్వారా ముస్లింలీగుతో ఐక్యం కావడం మనకు దారినిస్తుంది.

తర్వాత ఆ ఐక్యత హిందూ ముస్లిం ప్రజా సంయుతికీ తద్వారా భారత జాతీయైక్యతకూ తావలమవుతుంది.

ఈ ఐక్యత కేవలం వారూ వీరూ చేసుకొను అంగీకార పత్రింమీద కాదు. మరి ఆచరణలో. ఆహార సమస్యా పరిష్కారం జాతీయ సంపత్తి, మనుష్య సమీకరణం, దేశ రక్షణా ధురీణత వీనిలో నిర్మింపబడవలెను. కర్తవ్య పాలనాత్మకమైన ఐక్యతే ఐక్యత కానీ మాటలలో సిద్ధాంతా లలో ఐక్యత ఉన్నంతమాత్రంతో లాభంలేదు.

బాధ్యతను గుర్తెరిగిన ప్రతి దేశభక్తుడూ యీ మహా విపద్దశలో ప్రజావర్గం కుంగిపోయినప్పుడు వారి సేవనమూ సమస్యా పరిష్కారమూ కొఱకు ఐక్యతకై ప్రజలను సంఘ టిత పఱచాలి. ఆ సమస్యాపరిష్కారక కార్యాచరణలోనే ఐక్యత మఱింత బలపడుతుంది.

"ప్రజాసేవలో హృదయ పూర్వకంగా సహకారం చేయ డం ద్వారానే శాశ్వత జాతీయైక్యత నిర్మితం కాగలదు." (సరోజినీనాయుడు వంగ క్షామాన్నిగూర్చిన ప్రకటనలో.)

ఆ జాతీయైక్యత ద్వారా మనం అధికారవర్గ దృష్టి మరలించి ఉదాసీనతను తొలగించగలరు. అందుకే మనం పని చేయాలి. తద్వారా జాతీయ నాయకులను విడిపించు కొనాలి. జాతీయ ప్రభుత్వాన్ని స్థాపించుకోవాలి.

ఇట్లా జాతీయైక్యత దేశరక్షణకై పనిచేస్తూ మన జనాన్నే కాక విదేశీయులను కూడా మనం స్వతంత్రతకూ నాయక నిర్బంధ విముక్తికీ కూడగట్టుకొని రాగలము. అప్పుడే ఆ సూచన లగపడుతున్నవి. మనం ఫాసిస్టుల కనుకూలులనే ప్రచారం సాగలేదు. బ్రిటనులోని కార్మిక సంఘం, ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు — సెప్టంబరు 1943 — 80

లక్షల సభ్యులుగలది—భారత సమస్యనుగూర్చి తీర్మానించింది. నాయకులను వదలడం, కాంగ్రెసుతో రాయబారాలు సాగించడం, జాతీయ ప్రభుత్వ నిర్వహణం అత్యవసరములని నొక్కి—చెప్పింది.

ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు — కార్మిక మహాసభ — అక్కడి లేబర్ పార్టీకి ముఖ్యనిదానం. లేబర్ పార్టీ నాయకత్వాని కిదొక కొలబద్దగా పనిచేయగలదు. బ్రిటీషు ప్రజానీక దృక్పథంలో వస్తూన్న మార్పును సూచించ గలదు.

అమెరికా కార్మిక సంఘం — C. I. O. కూడా యిట్లే తీర్మానించింది.

ఆస్ట్రేలియన్ కార్మిక సంఘం—లక్షలమంది—భారత ప్రతిష్టంభన తొలగించాలనీ నాయకులను విడువాలనీ జాతీయ ప్రభుత్వం స్థాపించాలనీ తీర్మానించింది.

ఇవన్నీ ప్రపంచ స్వతంత్ర ప్రజాభిప్రాయ మెట్లా సంఘటిత మౌతున్నదో సూచించగలవు. మన కార్యక్రమం తీవ్రమయ్యే కొద్దీ, మన ఐక్యత బలపడేకొద్దీ, మన దేశరక్షణా కార్యక్రమం బలపడేకొద్దీ, విదేశ ప్రజాభిప్రాయం మనవైపు తప్పక తిరుగుతుంది. పాలకవర్గం సంకుచితదృష్టిని తొలగించ గల్గుతుంది. అందుకు మనం నిరంతర దీక్షతో అచంచల విశ్వాసముతో అనన్య సామాన్య దేశభక్తితో నడుంకట్టి పని చెయ్యవలెను. ప్రజల కష్టాలను తొలగించుకొనేందుకు ప్రతి పక్షాన్నీ ప్రతి వర్గాన్నీ ప్రతి అభిప్రాయాన్నీ ఐక్యపఱచి సమీకరించవలెను.

కాంగ్రెసువారి, జాతీయ నిర్ణయ సూత్రాన్ని గుర్తించి ముస్లిం ప్రజానీకాన్ని, జాతీయైక్యతకూ రాజకీయ ప్రతిష్టం

భనా పరిష్కారానికీ ఉన్ముఖులను చెయ్యవలెను. ఆహార సమస్యాది పరిష్కారానికి ముందునిలబడి అన్నిపక్షాలతో సహకారాన్ని సంపాదించి పనిచేస్తూ, తద్వారా జాతీయమైక్యతను నిర్మించవలెను. అదే రాజకీయైక్యతకు పునాది అవుతుంది.

ముస్లింలీగు తన సంకుచిత దృక్పథాన్ని వదలిపెట్టవలెను. గాంధీజీ విడుదల తన సమస్యా పరిష్కారాని కెంత తోడ్పడుతుందో గుర్తించవలెను. ముస్లిం ప్రజానీకంలో కలుగుతూన్న ఐక్యతావాంఛను కప్పిపెట్టి కపటనాటక మాడరాదు. దేశీయ నాయకులూ జాతీయ సంస్థా లేనిది జాతీయ స్వయం నిర్ణయ సూత్రాన్నిగూర్చి ప్రజలను సమీకరించడం, అసాధ్యమనేది తెలుసుకొన వలెను. జాతీయ నాయకుల విడుదలా, జాతీయ ప్రతిష్టంభన తొలగడం, స్వయం నిర్ణయానికి ముఖ్యంగా ముందు జరగవలసినవని తెలుసుకొని అందుకై పని చేయవలెను.

దేశంలో ముఖ్య సంస్థలైన కాంగ్రెసు ముస్లింలీగులు దేశ మెంత అనాధస్థితిలో వున్నదో, ఫాసిస్టు దండయాత్రా భయ మెంత సమీపిస్తున్నదో, ప్రజ యెంత దీనంగా వున్నదో ప్రపంచ మానవకోటి యెట్టి సహాయాపేక్షక స్థితిలో వున్నదో గుర్తించి, పక్షాభిమాన అసూయలనూ తాత్కాలిక విఫలతలనూ లెక్కించక, మానవరక్షణకై దిగి రావలెను; ఐక్యం కావలెను. జాతీయ ప్రభుత్వాన్ని సాధించడానికి జాతీయ రక్షణా దేశ సమస్యా పరిష్కారమూ జాతీయైక్యతా ప్రధానములని పని చేయవలెను. స్వతంత్ర పోరాటం ఫాసిస్టు విరుద్ధ పోరాటంలో సమ్మిళితమై వుండి.

— ఫాసిజం విధ్వంసనం కావలెను. అవుతుంది.

---



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA114B163 |
| పుస్తకం పేరు | ఫాసిజం దాని విధ్వంసకం |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 97 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | P. Jayamma |
| పేజీలు విడదీసినది | P. Jayamma |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | NO |
| పరిస్థితి | good |